ఆగస్టు 2018

స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలతో!



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక   వెల రూ.30/-


















సంపుటి: 4 సంచిక: 5 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. ఆగస్టు 2018

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!

సందర్శించండి: http://kottapalli.in/2018/08/welcome



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510

కె. మల్లికార్జున: 9000453887




## విషయ సూచిక



ముఖచిత్రం: స్వాతంత్ర్య పోరాటం

చిత్రకారుడు: సి. రాము



కొత్తపల్లి 100 వ పుస్తకం!




---

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచై:
ప్రారభ్య విఘ్నవిహతా విరమంతి మధ్యా: ।
విఘ్నై: పున: పునరపి పునరపి ప్రతిహన్యమానా:
ప్రారబ్ధముత్తమ జనా న పరిత్యజంతి ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

ఆరంభింపరు నీచ మానవులు విఘ్నయాస సంత్రస్తులై;
యారంభించి పరిత్యజించెదరు విఘ్నాయత్తులై మధ్యముల్;
ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థములుజ్జగింపరు సుమీ! ప్రజ్ఞా నిధుల్ గావుతన్!

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భావం: ఆటంకాలు ఎదురవుతాయని భయపడి, కొందరు పనులను అసలు చేపట్టరు. అట్లాంటి వారు అధములు. మరి కొందరు పనులను చేపట్టి, ఆటంకాలు ఎదురైనప్పుడు మధ్యలోనే వదిలిపెడతారు- వారు మధ్యములు. ఇక ధీరులు అనబడేవాళ్ళు ఆటంకాలనన్నిటినీ అధిగమిస్తూ, తమవైన ధైర్య సాహసాలవల్ల ఉత్సాహవంతులై ముందుకు సాగుతారు. అట్లాంటి జ్ఞానులు ప్రారబ్ధం గురించి పట్టించుకోరు.

# బిక్కమొహాలు



ఏదో అయింది చిట్టి పిల్లికి.

అమ్మ పాలే తాగుతోంది ఇంకా.

ఎలుకలు కనిపించినా వాటి వెంట పరిగెత్తట్లేదు.

"పిచ్చిది! ఎట్లా బతుక్కుంటుందో ఏమో! కనీసం ఎలుకల వెంటపడటం కూడా రాదు!" అని విచార పడింది అమ్మ పిల్లి

అయినా ఏమీలాభం లేదు. చిట్టిపిల్లి మారలేదు. "ఇకతప్పదు" అని ఒక రోజున అమ్మ దాన్ని డాక్టరు పిల్లి దగ్గరికి తీసుకెళ్లింది.

డాక్టరు పిల్లి దాన్ని పరీక్షించింది: ఎలుకనొక దాన్ని ఆ గదిలో వదిలి చూసింది. చిట్టిపిల్లి బిక్క మొఖం వేసుకొని కూర్చున్నది తప్ప, కదల్లేదు - మెదల్లేదు.

"నిజమే చిట్టి పిల్లికి ఏదో అయింది" అని తేల్చింది డాక్టరు. ఆకలి పెరిగేందుకు మందులు రాసింది.

చిట్టిపిల్లి ఇప్పుడు అమ్మపాలు ఇంకా ఎక్కువ తాగుతోంది.



అమ్మ ఇంకా బక్కగా అయ్యింది.

"ఇదేంటి?! ఎలుకల్ని పట్టి తినే వయసొచ్చినా ఇంకా నా మీదే ఆధారపడుతోంది? దీనికి పాలివ్వలేక నాపని అవుతోంది. ఇక నావల్లకాదు!" అని ఓరోజున తనకు ఎదురైన అవ్వపిల్లితో మొరపెట్టుకున్నది అమ్మ.

అనుభవం గల అవ్వ పిల్లి నవ్వింది: "పిచ్చిదానా! తప్పంతా నీలోనే ఉంది. నువ్వు దానికి ఎలుకల వెంట  పడటం అసలు నేర్పనే లేదు కదా! ఆ పనిలో ఎంత మజా ఉంటుందో ఏమాత్రం తెలీదు దానికి! అందుకని, ఓ పని చెయ్యి-  అది చూస్తూండగా ఎలుకల్ని పట్టుకో నువ్వు.  నువ్వు చేసే ఆ పనిలో చాలా ఉత్సాహం, పట్టుదల చూపించాలి. నిన్ను చూసి దానికి ఉత్సాహం రావాలి. ఒక్కసారి అట్లా ఆ పనిలో సంతోషం ఉందని అర్థమైతే ఇంక మీ పిల్ల నీ వెంట ఉండమన్నా ఉండదు. ఎప్పుడూ ఇంక ఎలుకల వెంటే పోతుంది-ప్రయత్నించు!" అన్నది.

అమ్మ పిల్లికి ఆ మాట నచ్చింది. వెంటనే అమలు పరచింది.



వారం  తిరిగే సరికల్లా చిట్టి పిల్లి మారి పోయింది! ఇప్పుడది రోజుకు ఓ పది ఎలుకల్నీ, తొండల్నీ పడుతున్నది. పాలకోసం అమ్మని వేధించటం అయితే పూర్తిగానే మానేసింది!

పిల్లలు కూడా ఇంతే. వాళ్లు చేసే పనుల్లోనూ, చదివే చదువుల్లోనూ సంతోషం ఉందని అర్థమైందంటే, అప్పుడిక వాళ్లని ఆపేదంటూ ఏదీ  ఉండదు; చదవమని వెంటపడే అవసరమూ ఉండదు; వాళ్ల ఆరోగ్యం కోసం, వాళ్ల ఆనందం కోసం వాళ్లు  పని చేస్తారు!

ఎటొచ్చీ ఆ పనుల్నీ, చదువుల్నీ ఉత్సహాభరితాలుగా తీర్చిదిద్దటం పెద్దల బాధ్యత, మరి.

పిల్లల పనుల్ని, చదువుల్నీ అట్లా తీర్చిదిద్దుతున్న పెద్దలకు నమస్కారాలతో,

కొత్తపల్లి బృందం.




# కరిగిన అహం

*రచన : విష్ణుతేజ, 8 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు.*
*మార్పు చేర్పులు : కొత్తపల్లి*

అనగనగా ఒక పెద్ద రాజ్యం. ఆ రాజ్యానికి ఒక రాజు ఉండేవాడు. అతని పేరు శూరసేనుడు. శూరసేనుడికి చాలా పెద్ద కోట ఉండేది. ఆ కోట నిండా బంగారం ఉండేది.

రాజు ప్రజలను హింసించి వాళ్ళ దగ్గర నుండి కప్పాలు వసూలు చేసేవాడు. 'పన్నులు కట్టేందుకు సరిపడా పంటలు వాళ్ళకు పండాయా, లేదా' అని చూసేవాడు కాదు. 'ఈ ప్రపంచంలో తన కంటే గొప్ప వాడు లేడు' అని అనుకునేవాడతను.

సహజంగానే అట్లాంటి రాజులకు యుద్ధం అంటే చాలా ఇష్టంగా ఉంటుంది. ఒకసారి పొరుగు దేశం మీద యుద్ధం చేయాలని ప్రకటించాడు శూరసేనుడు. ఆ దేశం వాళ్ళు

ఇతన్ని ధైర్యంగా ఎదుర్కొన్నారు కానీ, చివరికి ఇతనే గెలిచాడు.

దాంతో శూరసేనుడి అహంకారానికి పట్ట పగ్గాలు లేకుండా అయింది. అతను చేయించిన ఆ యుద్ధంలో అనేకమంది సైనికులు మరణించారు; వారి కుటుంబాలన్నీ వీధిన పడ్డాయి.




అయినా యుద్ధోన్మాదంలో మునిగిన శూరసేనుడికి, 'సైనికులు తనవారు' అనే ఆలోచనే లేదు! 'తను గెలవాలి' అనే పట్టుదల వల్ల, ప్రజలు, సైనికులు అందరూ పరాయి వాళ్ళే అయ్యారు!

ఒక రోజున అతను ఎప్పటిమాదిరే గుర్రం ఎక్కి అడవికి బయలుదేరి పోయాడు, వేటాడేందుకు. అసలైతే రాజులు ప్రజల సమస్యలను వినాలి; వాటిని పరిష్కరించాలి. ఇప్పుడు క్రూరమృగాల సమస్యలేమీ లేవు: అయినా శూరసేనుడి తీరు అంతే.

అడవిలో అతనికి జింకలు, కుందేళ్ళు మాత్రం ఎదురయ్యాయి. అవన్నీ తనని చూసి బెదిరి పరుగు పెడుతుంటే, అతని చేతులు దురద పెట్టాయి. చివరికి ఓ కుందేలుని చంపేందుకు బాణాన్ని ఎక్కుపెట్టాడు.

***

అంతలో అతనికి కళ్ళు తిరిగినట్లు అయింది. ఎవరో ఋషి వచ్చాడు- ఎక్కడినుండో, మరి?! "కుందేలుని చంపద్దు!" అన్నాడు.

"ఇది నా రాజ్యం; ఇక్కడ నేను నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను- నువ్వెవరు, నన్ను ఆపడానికి?" అన్నాడు రాజు, ఆవేశంగా.

ఋషి నవ్వాడు. "ఆలోచించు. నీ రాజ్యంలో ప్రజలంతా నిజానికి నీ పిల్లలే. ఇక్కడి

జంతువులన్నీ నిన్నే నమ్ముకొని జీవిస్తై. ప్రజల్ని వేధించటం, జంతువుల్ని చంపటం- అదేం గొప్ప?" అన్నాడు. అయినా శూరసేనుడి మనసు మారలేదు. "ప్రక్కకు జరుగు. లేకపోతే బాణం నీకే తగుల్తుంది" అన్నాడు.

"ఇదిగో, నా మాట వినకపోతే నీకు పుట్ట-బోయే పిల్లలు పందుల వలే పుడతారు" అన్నాడు రుషి. శూరసేనుడు గట్టిగా నవ్వేసి, "చూద్దాం" అంటూ కుందేలుని చంపేసాడు!




అతను రాజధానికి తిరిగి వెళ్ళే సరికి 'రాణికి కవల పిల్లలు పుట్టారు' అని వార్త వచ్చింది. వెంటనే రాజు ఉత్సాహంగా ప్రసూతి గృహం వైపుకు వెళ్ళాడు- రాణిని పలకరించేందుకు, తన పిల్లల్ని చూసేందుకు! తీరా చూస్తే ఆ పిల్లలు ఇద్దరూ రెండు చిట్టి చిట్టి పంది పిల్లల్లాగా ఉన్నారు!

శూర సేనుడికి మతి పోయింది. గిర్రున వెనక్కి తిరిగి తన ప్రాసాదానికి వెళ్ళిపోయాడు. అయినా అతని మనసు మనసులో లేదు: "తన పిల్లలు అలా ఉండేందుకు వీల్లేదు. ఎందుకు అవుతారు, అలాగ?!" మళ్ళీ ఓసారి ప్రసూతి గృహానికి వెళ్ళి చూసుకున్నాడు.

నిజమే-" రెండు చిట్టి చిట్టి పంది పిల్లలు!- "కుదరదు- అవి అట్లా ఉండే వీల్లేదు!" అని అతని మనసు అరిచింది. ఆవేశం వచ్చింది. చర్రున కత్తి దూశాడు. పంది పిల్లల్ని రెండిటినీ చేత్తో పట్టి ఎత్తాడు- చంపేద్దామని. కానీ వాటి ముఖాల్లో అతనికి తనే కనిపించాడు. వాటి కళ్లలో తన రాణి! శూరసేనుడి కళ్ళు నీళ్లతో నిండిపోయాయి. కత్తి అతని చేతిలోంచి జారి పడింది...

***

తెలివి వచ్చేసరికి శూరసేనుడు ఇంకా అడవిలోనే ఉన్నాడు- రాజ్యానికి పోనే లేదు, ఇంకా! అతని కళ్ళ ఎదురుగానే కుందేళ్ళు చెంగు చెంగున ఎగురుతున్నాయి, జింకల గుంపులు పోతున్నాయి నిర్భయంగా. అతని చేతిలోని ధనుర్బాణాలు క్రింద పడి ఉన్నాయి. చిత్రంగా, ఇప్పుడు ఆ జంతువులన్నిటిలోనూ తన ప్రతిబింబం కనిపిస్తోంది అతనికి.




వాటిని వేటాడాలనే ఆలోచనే లేదు అతనిలో.

అతనిక నిద్రలో ఉన్నట్లే వెనక్కి తిరిగి వచ్చాడు రాజ్యానికి.

"జయము జయము మహారాజా! మన రాజ్యానికి యువరాజుల వారు పుట్టారు! చంద్రబింబం లాంటి ముఖం! అచ్చుగా తమరి పోలిక!" అని సంతోషంగా స్వాగతించారు పురోహితులు. ప్రజలంతా ఆ సరికే పండుగల్లో మునిగి ఉన్నారు!

శూరసేనుడు వెళ్ళి రాణిని, కొడుకును చూసి వచ్చాడు. కొడుకు పందిలాగా లేడు- మామూలుగానే ఉన్నాడు- చాలా అందంగా, అచ్చు తన లాగానే! కానీ ఎందుకనో, తనే, పూర్తిగా మారిపోయాడు... తన అహం ఏదో కరిగిపోయింది!

శూరసేనుడికి ఇప్పుడు ప్రజలందరిలోనూ స్వయంగా తనే కనిపిస్తున్నాడు! పూర్తిగా ప్రజల మనిషి అయిపోయాడు అతను. అటుపైన అతను తన సంపదని యావత్తూ కేవలం ప్రజల మేలు కోసమే వినియోగించి 'మంచి రాజు' అనిపించుకున్నాడు. ★

డాక్టర్: ఏమయ్యా, ఇదేమైనా పద్ధతిగా ఉందా? ఫీజుగా నువ్విచ్చిన చెక్ బౌన్స్ అయ్యి తిరిగి వచ్చింది.!
పేషంట్: మరి క్రితం సారి మీరు నయం చేసిన రోగం నాకు మళ్ళీ తిరిగి వచ్చింది గద సార్?!



# ఆశల చెట్టు కథ

*అబ్బా! 'దురాశ దు:ఖానికి చేటు ' అని ఎన్ని రకాలుగా చెప్పుకోవచ్చో, కదా?!*

*రచన: అసిఫ్, 7 వ తరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

అనగనగా ఒక ఊళ్లో వెంకట్రావు అనే లారీ డ్రైవరు ఒకడు ఉండేవాడు. అతనికి ఒక సొంత లారీ ఉండేది.

దూరప్రాంతాల అడవుల్లో ఏపుగా పెరిగిన వెదురును కొట్టించటం, లారీలో ఆ వెదురును తీసుకొచ్చి, తమ పట్నంలోని వ్యాపారులకు అమ్మటం అతని వృత్తి. అట్లా ఒకసారి వెదురు కోసం వెతుకుతూ వెతుకుతూ అతను దారి తప్పి, ఎక్కడికో వెళ్ళిపోయాడు. అక్కడ అర్థంతరంగా అతని లారీ ఆగిపోయింది. ఎంత ప్రయత్నించినా ఇక కదలలేదు.

సమయం సాయంత్రం 6:30 అవుతున్నది. కీకారణ్యం, ఇప్పట్లో వేరే ఏ వాహనమూ అటువైపుకు వచ్చే అవకాశం లేదు. అతను చాలా నిరాశ పడిపోయాడు.

పైపెచ్చు దగ్గరినుండే ఏనుగుల ఘీంకారాలూ, సింహాల గర్జనలూ వినబడుతున్నాయి. చీకటి పడుతుండగా వెంకట్రావుకు భయం వేసింది. లారీలో పడుకోవచ్చు; కానీ 'ఏ ఏనుగులో వచ్చి, లారీతో సహా తనను నెట్టేస్తే?' అన్న ఊహ ఒకటి అతనికి నిద్రపట్టనివ్వలేదు.




ఆ గందరగోళంలో అతను కొంత సేపు బయట ఓ చెట్టు మీద పడుకునేందుకు ప్రయత్నించాడు. 'కొండచిలువలు చెట్ల మీదే ఉంటాయట-' అని ఆలోచన మొదలైంది. ఇక రాత్రంతా నిద్రలేదు.

బారెడు ప్రొద్దెక్కాక కళ్ళు తెరవిన వెంకట్రావుకు తనవైపే చూస్తున్న ఋషి ఒకడు కనిపించాడు. అతను వెంటనే చెట్టు దిగి ఋషిని చేరి, 'స్వామీ! ఇది నా లారీ. నేను, నా లారీ ఇద్దరం ఈ అడవిలో ఇరుక్కుపోయాం. రాత్రంతా భయం గుప్పిట్లోనే బ్రతికాం- దగ్గర్లో జనావాసాలు ఏమున్నాయో తెలీదు- కాపాడండి' అని మొత్తుకున్నాడు.

"నాయనా! ఇక్కడికి దగ్గర్లో మానవసంచారం ఉండే ప్రాంతాలే లేవు. నువ్వు అడవిలో చాలా దూరమే వచ్చినట్లున్నావు. సాధారణంగా ఇటువైపుకు మనుషులు ఎక్కువగా రారు- నీ లారీకి మరి ఏం సమస్య వచ్చిందో ఏమో, పరిష్కారం నువ్వే కనుక్కోవాలి. ఏమంటే, ఆ సమస్య తీరేవరకూ నువ్వు నాతోపాటు ఉండచ్చు; నేను పెట్టేదేదో తినచ్చు; ఇక్కడే ఏ గుహలోనో పడుకోవచ్చు!" అన్నాడు ఋషి.

"సరే" అన్నట్లు తల ఊపాడు వెంకట్రావు. "సరే మరి. కొంచెం ఆగు- నీకోసం ఏమైనా

తెచ్చిపెడతాను" అని ఋషి వెళ్ళి కొన్ని 'స్వీట్స్' తీసుకొచ్చాడు. బాగా ఆకలిగొని ఉన్నాడేమో, వెంకట్రావు ఆవురావున తినేసాడు అన్నిటినీ.

ఆ తర్వాత ఋషి మంచి భోజనం తెచ్చి పెట్టాడు. దాన్ని తిన్న వెంకట్రావుకు అది అమృతమే అనిపించింది. భోజనం చేసి కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాక, లారీ రిపేరు మొదలు పెట్టుకున్నాడు వెంకట్రావు.

ఋషి తన మాటను నిల్పుకున్నాడు. ప్రతిరోజూ మూడుపూటలా చక్కని ఆహారం తెచ్చిపెట్టాడు. ప్రతి పూటా ఏవో కొన్ని స్వీట్లు కూడా తెచ్చేవాడు. వెంకట్రావు కూడా లారీ సమస్యను పరిష్కరించేందుకు చిత్తశుద్ధితో పని చేసాడు. అలా ఐదారు రోజులు గడిచాయి.

ఆ రోజున ఋషి అతనికోసం చక్కని ఆపిల్ పళ్ళు తీసుకు వచ్చాడు. వెంకట్రావు వాటిని తీసుకొని, "అయ్యా! తమరు నాకు ఇంత మంచి భోజనం పెడుతున్నారు; రోజూ స్వీట్లు కూడా తెచ్చి ఇచ్చారు- ఇప్పుడు ఈ ఆపిల్ పళ్ళు! ఇవన్నీ అడవిలో దొరికేవైతే కాదు. చూడగా తమరికి ఏవో మహిమలు ఉన్నాయని నాకు అనిపిస్తుంది. అవేవో నాకూ నేర్పండి" అని ప్రాధేయపడ్డాడు.

"నాయనా! ఏ పనైనా స్వయం కృషి వల్ల జరగాల్సిందే తప్ప, మహిమలు ఎవరికీ మేలు చేసి ఉండలేదు ఇప్పటివరకూ. లేకపోతే నీ లారీని నేనే బాగుచేసి ఉండనా? నేను చాలా మామూలు మనిషిని" అన్నాడు ఋషి మరలిపోబోతూ.

కానీ వెంకట్రావు వదల్లేదు. ఆ రహస్యం తనకు చెప్పాల్సిందేనని పట్టుబట్టాడు.

చివరికి ఋషి రహస్యం చెప్పేసాడు- "బాబూ! ఇక్కడికి కొద్ది దూరంలో ఒక 'ఆశల చెట్టు' ఉంది. ఆ చెట్టు క్రింద నిలబడి ధైర్యంగా ఎవరు ఏం కోరితే దాన్ని ఇస్తుందది. అయితే అనుమానిస్తే మటుకు, ఆ అనుమానాల్నే నిజం చేస్తుంది- జాగ్రత్తగా ఉండాలి! అంతేకాక, అది సృష్టించే వస్తువులు ఉండేది కొన్ని గంటలపాటు మాత్రమే. కొద్ది సేపట్లో అన్నీ మాయమైపోతాయి" అని.

ఆయన చెప్పిన గుర్తుల్ని పట్టుకొని వెంకట్రావు ఆ చెట్టు దగ్గరికి వెళ్ళి "నా లారీ బాగైపోయి, దానిలో పట్టేంత వెదురు రావాలి" అని కోరుకున్నాడు. మరుక్షణం లారీ బాగైంది; దాని నిండా వెదురు తయారైంది!




వెంకట్రావు ముఖం వెలిగింది. "ఋషి బలే మోసం వాడు. ఆయన ఈ సంగతినేదో ముందుగానే చెప్పి ఉంటేనేమి?!" అనుకున్నాడు. లారీ ఎక్కి బయలుదేరుతూండగా "ఈ లారీ బాగుండేది మరో కొద్ది గంటలు మాత్రమే. ఆలోగా అడవి దాటకపోతే మరెలాగ?"; "మరి ఈ లారీలోని వెదురుకూడా, ఉండేది కొద్ది గంటలే కదా?! ఆ తర్వాత అది మాయమైపోతుంది! ఏం లాభం?" అని, అతనిలో ఆలోచనలు మొదలయ్యాయి.

దాంతో అతను ఒక నిశ్చయానికి వచ్చి, మళ్ళీ చెట్టు దగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు: "నువ్వు కూకటి వ్రేళ్లతో సహా పెకిలి, నా లారీలోకి వచ్చేయాలి" అని కోరుకున్నాడు.

మరుక్షణం చెట్టు వ్రేళ్లతో సహా పైకి లేచి, అప్పటికే వెదురుతో నిండుగా ఉన్న లారీపైకి వచ్చి కూర్చున్నది. లారీ ధబుక్కున అణిగిపోయింది, అయితే మురిసిపోతున్న వెంకట్రావు దాన్ని గమనించే దశలో లేడు-

లారీని అతను ఇప్పుడు చాలా ఉత్సాహంగా బయలుదేరదీసాడు- "ఈ చెట్టు ఇక నాతోటే ఉంటుంది. నేను దీన్ని వెనక్కి పోనివ్వను. మా ఇంట్లో నాటుకుంటాను. ఎన్నంటే అన్ని కోరికలు తీర్చుకుంటాను! నన్ను మించిన వాడు లేడు!" అనుకుంటూ.

అయితే బరువు ఎక్కువైన లారీ ముందుకు కదలకపోవటమే కాదు, అటూ ఇటూ ఊగటం కూడా మొదలు పెట్టింది...

"అయ్యో! పల్టీ కొడుతుందా, ఏంటి?" అనుకున్నాడు వెంకట్రావు కంగారుగా. అంతే! క్షణంలో లారీ పల్టీ కొట్టింది. వెదుర్లన్నీ మీద పడిన వెంకట్రావు ఇక లేవలేదు!

ఆశల ఆ చెట్టు మటుకు దొర్లి క్రింద పడింది- కొద్ది సేపట్లో మళ్ళీ ఎక్కడుండేది అక్కడికి చేరుకున్నది! ★

## ఇది కొత్తపల్లి వందో పుస్తకం!

గమనించారా? ఈ పుస్తకంలో అన్ని కథలూ పిల్లలు వ్రాసి పంపినవే! కథలకు బొమ్మలు వేసిన వాళ్ళు కూడా పిల్లలే! ఈ బాల చిత్రకారులు అందరూ అనంతపురం రాధా స్కూల్‌లో ఏడు-ఎనిమిది-తొమ్మిదో తరగతులు చదువుతున్నారు. అనుకుంటే, వాళ్ళ లాగానే మీరూ బొమ్మలు వేయచ్చు; మీరూ కథలు రాయచ్చు!

పిల్లలను కలవటం, వాళ్ల చేత తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేసి, ఇష్టపడిన వాళ్లకు అందించటం మాకు ఇష్టం. ఇప్పటి వరకూ వచ్చిన వంద పుస్తకాల్లో యాభై పుస్తకాల ప్రతులు మాత్రం మా దగ్గర లభిస్తున్నాయి ప్రస్తుతం. మిగిలినవాటిని ఇంటర్నెట్లో చదువుకోవలసిందే.

ఈ పనులన్నీ ఎందుకు? ఎందుకంటే ఇవి అందరికీ మేలు చేస్తాయి కాబట్టి! ఇట్లా అందరి మేలూ కోరి చేసే పనుల్లో మీ శక్తి కొద్దీ మీరూ పాలుపంచుకోండి. బాగా చదవండి! బాగా గీయండి! బాగా రాయండి! నవ్వండి! ఆలోచించండి! చక్కగా పాడండి! మంచి పౌరులుగా ఎదగండి!

**పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !**




# అరిసెల కథ

తెలుగు జానపద కథ

*ఎన్ని సార్లు విన్నా మళ్ళీ నవ్వించే ఈ తెలుగు జానపద కథ, మీకోసం..*
*సేకరణ : హిమవర్షిణి, 8 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి.*

రామాపురం అనే ఊళ్ళో పుల్లమ్మ, పుల్లయ్య అనే పేద బ్రాహ్మణ దంపతులు ఉండేవాళ్ళు.

ఆ రోజు పండుగ రోజు. ఊళ్ళో వాళ్ళంతా మంచి మంచి వంటకాలు చేసుకొని తింటున్నారు. తాము కూడా ఏదో ఒకటి చేసుకొని తినాలనిపించింది పుల్లయ్యకు. అయితే ఇంట్లో ఏం సామానులు ఉన్నాయో, ఏవి లేవో తెలీదు; ఇంకా తెమ్మంటే తెచ్చేందుకు తన దగ్గర డబ్బు కూడా లేదు!

అందుకని అనుమానంగానే - "ఇదిగో అమ్మీ, నేను యాయవారానికి వెళ్తున్నాను. పండగ కదా, నేను తిరిగి వచ్చేలోగా తినేందుకు ఏ అరిసెలో చేసి పెట్టు" అని చెప్పి, పుల్లమ్మ నోరు తెరిచేలోగా బయటికి వెళ్ళి పోయాడు.

"అరిసెలు తినాలనిపిస్తున్నట్లుంది, పాపం" అని పుల్లమ్మ డబ్బాల్లో వెతికింది. ఓ పది పన్నెండు అరిసెలకు సరిపడ సామాన్లు మాత్రం ఉన్నాయి ఇంట్లో.




"ఊరికే ఇంతింత ఖర్చు పెట్టుకోకూడదు. ఒక్క నాలుగు అరిసెలు మాత్రం చేస్తాను- చెరి రెండూ వస్తాయి, చాలు!" అని కొంచెం బియ్యప్పిండి మాత్రం తీసుకొని, దానిలోకి కొంచెం బెల్లం పాకం వేసి కలిపింది పుల్లమ్మ. ముందుగా ఒక అరిసె చేయగానే, ఆ ఘుమఘుమలకి ఆమె నోరు ఊరింది.

"ఎట్లా ఉందో, ఏమో- చూడకపోతే మిగతా అరిసెలు పాడౌతాయి" అంటూ ఆ అరిసెను తినేసింది ఆమె.

చూస్తే అందులో బెల్లం ఎక్కువైంది!

"అయ్యో! తీపి ఎక్కువైతే బాగుండదు!" అంటూ ఇంకొంత బియ్యప్పిండి తెచ్చి కలిపి, మరొక అరిసె చేసింది.

ఆ అరిసె తిని చూస్తే తెలిసింది: తీపి తక్కువ ఉంది!

అందుకని ఇంకొంత పాకం పట్టి, దానికి కలిపి, ఇంకో అరిసె చేసి, రుచి చూసింది.

ఈసారి చేసిన అరిసె చాలా తియ్యగా అయింది.

మళ్ళీ పిండి పోసింది; ఈసారి మళ్ళీ పాకం తక్కువ అయ్యిందని పాకం; తీపి ఎక్కువైందని పిండి- ప్రతిసారీ ఒక అరిసె చేస్తూ, దాన్ని రుచి చూస్తూంటే పిండి మొత్తం దగ్గరపడింది. అంతా బాగుంది అనుకునే సరికి, చివరికి కొంచెమే పిండి

మిగిలింది! ఆ పిండితోటి రెండే అరిసెలు తయారయ్యాయి!

కొద్దిసేపటికి పుల్లయ్య వచ్చాడు: "వాసన ఘుమ ఘుమలాడుతున్నది. ఏం చేసావే?" అని అడిగాడు సంతోషంగా, నవ్వుకుంటూ.




"అరిసెలు చేశానండీ! మీరు అరిసెలేగా, చెయ్యమన్నది?! అవంటే నాకు కూడా ఇష్టమాయె!" అన్నది పుల్లమ్మ.

"తొందరగా తీసుకురావే, నోరు ఊరుతున్నది. కడుపులో ఆకలి దంచేస్తున్నది!" అన్నాడు పుల్లయ్య, కంచం ముందు కూర్చుంటూ.

"సరేనండీ!" అని తను చేసిన ఆ రెండు అరిసల్నీ పట్టుకొచ్చేందుకు లోపలికి వెళ్ళిన పుల్లమ్మ, అక్కడి అరిసెల్ని చూస్తూ ఆగలేకపోయింది: "సగం నా వాటా, కదా?!" అంటూ తన వాటా క్రింద వచ్చే ఒక అరిసెనూ దారిలోనే తినేసింది- మిగిలిన ఒక్క అరిసెను మాత్రం కంచంలో పెట్టి భర్త ముందు పెట్టింది.

పుల్లయ్య ఆ అరిసెను చూసి విస్తుపోయాడు- "ఒక్కటేనా?! అదేనా, వొచ్చింది?!" అన్నాడు ఏడుపు మొహం పెట్టి.

"లేదండీ! మొత్తం 12 అరిసెలు వచ్చాయి; కానీ మిగితా పదీ రుచి చూడటానికే సరిపోయాయి!" అన్నది పుల్లమ్మ అమాయకంగా.

"అన్నేసి అరిసెలు ఎలా తిన్నావే?!" అన్నాడు పుల్లయ

"అది.. ఎలా తిన్నానంటే...ఇలా!" అని ఆ ఒక్క అరిసెను కూడా తీసుకొని తినేసింది పుల్లమ్మ!



# చేసిన మేలు

బొమ్మల కథ

*ఈ కథలో ఒత్తులు లేవు చూసారా?! ఇట్లా ఏవైనా నియమాలు పెట్టుకొని కథలు రాయటం బాగుంటుంది. ఇట్లాగే ద్విత్వాక్షరాలు లేకుండా రాయచ్చు; సంయుక్తాక్షరాలు లేకుండా రాయచ్చు; తలకట్టు, దీర్ఘం, గుడి మాత్రమే ఉండేట్లు రాయచ్చు; సామాన్యంగా వచ్చే ఏవో కొన్ని అక్షరాలు అసలు రాకుండా రాయచ్చు! నియమాలు పెట్టుకొని రాయాలంటే, మరి వాటికి సరిపోయే పదాల్ని వెతుక్కోవాల్సి వస్తుంది. ఆ పనిలో ఒక్కోసారి చాలా మజా వస్తుంది- మీరూ ప్రయత్నించండి!*

*రచన : 3 వ తరగతి పిల్లలు, ,రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్,అనంతపురం*



అనగనగా ఒక అడవిలో ఒక కాకి, ఒక కోయిల ఉండేవి. అడవిలోని ఒక వృక్షం మీద వాటి నివాసం ఉండేది.



ఒకరోజున వాటికి చాలా ఆకలైంది. ఆహారం కోసం అడవి అంతా గాలించాయి. ఎంత వెతికినా తినేందుకు ఏమీ దొరకలేదు. తిరిగి తిరిగి పాపం, అవి బాగా అలసిపోయాయి కూడా.



దాహంతో వాటి నోరు పిడచబారింది. "ఇక లాభం లేదు- ఈ పూటకు నీటితోటే కడుపు నింపుకుందాం!' అని అనుకునే సరికి అవి అడవిని దాటి జనావాసాలను చేరుకొనేసాయి!

అది మండు వేసవి. ఊరిలో కూడా ఏ మూలనా నీటి జాడ లేదు. మనుషులుండే గుడిసెలలోకి పోయి వెతికేంత చొరవ వీటికి లేదు! ఆ సరికి అవి రెండూ చాలా అలసి పోయాయి. అంతలో కొంత దూరాన మంచి చేను ఒకటి కనబడింది.



రెండూ ఆ చేనును చేరుకునేసరికి కోయిల మరింత నీరసించింది. ఇక దానికి అడుగు తీసి అడుగు వేసేంత బలం కూడా లేదు. ఉండిన చోటనే కూలబడిపోయింది. కాకి ఒంటరిగా చేనులోకి పోయింది.

చేనులో దూది విరగకాసి ఉండింది. కానీ నీరు ఏ మూలనా పారటం లేదు- బిందు విధానం వలన! అయితే బోరుబావి కాడ నీరు కొంచెం కొంచెంగా కారుతూ ఉండింది!

కాకి ఆ తావును చేరి, తాను గబగబా కాసంత నీరు తాగేసి కడుపు నింపుకుంది. 'మరి కోయిలకు నీరు తీసుకొని పోయేది ఎలాగ?' అని ఆలోచించింది. అంతలో దాని చూపు దూది మీద పడింది. గబగబా పోయి, కొంత దూదిని సేకరించి, దానిని నీటిలో తడిపింది.

తడి దూదితో ఎగిరి కోయిలను చేరింది. కోయిల మన సోయిలో లేదు. కాకి తడి దూదిని దాని ముఖం మీద వేసి పిండింది. ఇలా రెండు మూడు తడవలు అటూ ఇటూ తిరిగి, తడి దూదిని తీసుకొని పోయి వేసే సరికి, ఆ తేమకు కోయిల కొంచెం కదిలింది.



కోయిల కనులు తెరిచేసరికి కాకికి చాలా సంతోషం వేసింది. అది ఇంకో మూడు వరుసలు తిరిగి మరింత తడి దూదిని తీసుకుపోయింది. అమృతం లాంటి ఆ నీటి బిందువుల వలన కోయిల తేరుకొనింది.

సంతోషంతో వాటికి సగం బలం సమకూరింది. ఇక అవి నిదానంతా చేనులోని బోరుబావిని చేరుకొని, కడుపులు నింపుకుని, కొంత సేపు సేద తీరాయి. చేనులో కాకికి తొండ లాంటిది ఒకటి దొరికింది కూడా. తనకు దొరికిన తిండిని అది కోయిలతో కూడా పంచుకొనింది.



సాయంకాలం అవుతుండగా కాకి, కోయిల రెండూ తిరిగి కాసిని నీరు తాగి, వెనుకకు మరలాయి.

'కలసి ఉండటం వలననే కదా, ఇవి తిరిగి రాగలిగింది?' అని అడవిలోని పక్షులు సంబరపడినాయి. 'కాకులు ఎలాగైనా చాలా తెలివైనవి' అని అభినందించాయి. 'ఇకమీద చాలా దూరాలు ఎగరకండి' అని తమ కూనలకు బోధించాయి.

# ఏనుగు - కుక్క

రచన: కుషాల్, 5 వ తరగతి, పోరంకి, వికాస విద్యావనం



అనగనగా ఒక రాజుగారికి ఒక ఏనుగు ఉండేది. ఆ ఏనుగును చూసుకునే మావటి వాడికి ఒక కుక్క ఉండేది.

మావటి వాడితో కలిసి ఏనుగు దగ్గరకు వెళ్ళేది కుక్క. ఏనుగు, కుక్క చాలా స్నేహంగా ఉండేవి. కలిసి ఆడుకునేవి.




ఒక సారి డబ్బు అవసరమయ్యి. మావటి వాడు తన కుక్కను అమ్మేశాడు. బాధపడుతూనే కుక్క కొత్త యజమాని వెంట వెళ్లింది.

కుక్క రాకపోయేసరికి, ఏనుగు ఆహారం తీసుకోవటం మానేసింది. నీళ్ళు కూడా తాగటం లేదు.




దానిని పరీక్షించిన వైద్యుడు "ఏనుగుకి ఏ జబ్బూ లేదు. ఇది ఎవరి మీదో బెంగతో ఉంది" అన్నాడు.

"ఈ ఏనుగు రోజూ ఒక కుక్కతో ఆడుకునేది కదా? ఆ కుక్క కనిపించట్లేదు! ఏమైంది దానికి? వెంటనే ఇటు తీసుకుని రండి దాన్ని!" అన్నాడు రాజు.

కొత్త యజమానికి ఆ సంగతి తెలిసి వెంటనే కుక్కను పంపించాడు. కుక్కను చూడగానే ఏనుగు లేచి నిల్చున్నది. కుక్క సంతోషంతో గంతులు వేసింది.



పద్యం!

ఊరక సజ్జనుండొదిగి యుండిననైన దురాత్మకుండు ని
ష్కారణమోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా
చీరలు నూరు టంకములు జేసెడివైనను పెట్టెనుండగా
జేరి చినింగిపోగొరుకు చిమ్మటకేమి ఫలంబు భాస్కరా?!

తాత్పర్యం: వందల కొద్దీ రూపాయల విలువ చేసేవైనా సరే, చీరలు పెట్టెలో ఉన్నాయంటే చిమ్మటలు వచ్చి వాటికి చిల్లులు పెడతాయి. అట్లా అని వాటికి ఏమైనా లాభం ఉంటుందా? ఉండదు. అదే విధంగా, మంచివాడు ఊరికే తన పని తాను చేసుకుంటూ ఒదిగి ఉన్నప్పటికీ, దుష్టుడు అసలు కారణం అంటూ ఏదీ లేకనే- ఓర్వలేక- వాడికి అపకారం తల పెడతాడు. అది వాడికి వచ్చిన ఒకే ఒక విద్య మరి!.




# గుడ్లగూబల సమస్య

*రచన: గౌతమి, 9 వతరగతి, జిల్లా ఉన్నత పాఠశాల, కోగిర*

*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

అనగనగా ఒక అడవిలో గొప్ప గుడ్లగూబ ఒకటి ఉండేది. దాని కళ్ళు పెద్దగా, భయంకరంగా, వికారంగా ఉండేవి. దాన్ని చూసి మిగతా పక్షులన్నీ ఎగతాళి చేసేవి.

దాంతో గుడ్లగూబకి చాలా బాధ వేసింది. ఎలాగైనా తన కళ్ళను మార్చుకోవాలనుకున్నది. కానీ ఎంత ప్రయత్నించినా దాని కళ్ళు మటుకు చిన్నవి కాలేదు. భరించలేక, చివరకి అది ఘోర తపస్సు చేసింది. దాని తపస్సుకు మెచ్చి దేవుడు కూడా త్వరగానే ప్రత్యక్షమైనాడు. "ఏమి కావాలో కోరుకో, గూబా!" అన్నాడు.

"దేవుడా, అందరికీ చక్కగా అంత చిన్న చిన్న కళ్ళు ఇచ్చావు. మాకు మటుకు ఇంత పెద్ద కళ్ళు! పది మందిలో ఎంత నగుబాటుగా ఉందో తెలుసా? మాకు ఈ పెద్ద కళ్ళు వద్దు!

అందరి మాదిరి, చిన్న చిన్న కళ్ళు చేసెయ్యి!" అని వేడుకున్నది గుడ్లగూబ.

"సరేలే, నీ ఇష్టప్రకారమే కానివ్వు" అంటూ దేవుడు వెంటనే గుడ్లగూబల కళ్ళను చిన్నవిగా, అందంగా మార్చేశాడు.




అందమైన చిట్టి చిట్టి కళ్ళు పెట్టుకున్న గుడ్లగూబలు చాలా సంతోషపడ్డాయి. తోటి పక్షులన్నిటికీ తమ కళ్ళను చూపించుకొని చాలా మురిసిపోయాయి. తమ అందానికి చాలా గర్వ పడ్డాయి. కొన్నయితే మిగతా పక్షులను కూడా ఎగతాళి చేసాయి!

అయితే రోజులు ఎప్పుడూ ఒకేలాగా ఉండవు కదా, కొన్ని సంవత్సరాలు గడిచాక, ఫ్యాషన్ మారింది. గుడ్లగూబలకు అసంతృప్తి మొదలైంది మళ్ళీ. "మాకిప్పుడు ప్రత్యేకతే లేకుండా అయ్యింది. అన్ని పక్షులలాగే ఉన్నాయి, మా కళ్ళు కూడాను!" అనుకోసాగాయి.

"పెద్ద పెద్ద కళ్ళు చాలా బాగుంటాయి. పాపం, ఈ గుడ్లగూబల కళ్ళు ఎంత చిన్నగా ఉన్నాయో చూడండి!" అని కొన్ని పక్షులు వాటి మీద జాలి చూపించసాగాయి కూడా.

కళ్లని పెద్దవి చేసుకునేందుకు గూబలు ఎన్ని మందులు వాడినా ప్రయోజనం లేకపోయింది. చివరికి ఒక గుడ్లగూబ మళ్ళీ తీవ్రమైన తపస్సు చేసింది. మళ్ళీ ప్రత్యక్షమైనాడు దేవుడు. "ఏంటి వత్సా, నీ కోరిక?" అంటూ.

"మాకళ్ళు ఎప్పటి లాగే పెద్దవిగా, గుండ్రంగా మార్చెయ్యి స్వామీ!" అన్నది గుడ్లగూబ.




"మరి అప్పుడు చిన్నగా, అందంగా కావాలన్నారు కదా?" అన్నాడు దేవుడు నవ్వుతూ.

గుడ్లగూబ ఏమీ అనలేకపోయింది. అయినా దేవుడు దాని కోరికను అర్థం చేసుకొని "సరేలే! ప్రస్తుతానికి మీ కళ్ళని తిరిగి పెద్దవి చేసేస్తున్నాను. ఇకమీద ప్రకృతి సహజంగా వచ్చినవాటిని వేటినీ చిన్న చూపు చూడకండి!" అని, నవ్వుతూ మాయమైపోయాడు.

ఆ తర్వాత గుడ్లగూబలు తమ పెద్ద కళ్ళతో, ఇప్పటికీ సంతోషంగా, వినయంగా ఉన్నాయి. ఎవరైనా "చిన్న చిన్న కళ్ళు- ఎంత బాగుంటాయో! మీ కళ్ళూ ఉన్నాయి చూడండి- బండలు బండలుగా!" అంటే అవి ఇప్పుడు నవ్వుతున్నాయి తప్ప, మరేమీ అనుకోవట్లేదు.



అరయ తరచు కల్లలాడెడు వారిండ్ల
వెడల కేల లక్ష్మి విశ్రమించు?
ఓటికుండ నీరు పోసిన చందాన!
విశ్వదాభిరామ వినుర వేమ!

భావం: చిల్లి కుండలో నీళ్ళు పోస్తే నిలవవు కదా, అలాగే ఊరికే అబద్ధాలు చెప్పేవారి ఇళ్ళలో కూడా సంపద నిలవదు.

పద్యం!

వేరుపురుగు చేరి వృక్షంబు జెరచును
చీడపురుగు చేరి చెట్టు జెరచు
కుత్సితుండు చేరి గుణవంతు జెరచురా
విశ్వదాభిరామ వినురవేమ!

భావం: వేరు పురుగు చెట్టు మొత్తాన్నీ పాడు- చేస్తుంది. చీడ పురుగు మొక్కను నాశనం చేస్తుంది. అట్లాగే చెడ్డ గుణాల వాడు చేరి మంచివాణ్ణి కూడా పాడు చేస్తాడు.




# ఇష్టమైన రంగాన్ని ఎంచుకో

*రచన: గండు వంశీమోహన్, 7 వ తరగతి, తేజ విద్యాలయం, కోదాడ*

అనగనగా ఒక ఊరు. ఆ ఊరి పేరు తొగర్రాయి. ఆ ఊరి బడిలో యశ్వంత్ అనే పిల్లవాడు ఉండేవాడు. వాడికి అసలు చదువే రాదు.

సాధారణంగా వాడి చదువుని ఎవ్వరూ పట్టించుకునేవాళ్ళు కాదు. టీచర్లు కూడా వాడిని ఏమీ అడిగేవాళ్ళు కాదు- వాడు సమాధానం చెప్పలేడని వాళ్లకు తెలుసు. అయితే ఒక రోజున ప్రధానోపాధ్యాయుడు వాడిని కొట్టాడు- "ఇంత చిన్న సంగతులు కూడా తెలీట్లేదు నీకు- ఇంక చదువుకొని ఏం ప్రయోజనం?" అని కూడా అరిచాడాయన.

యశ్వంత్‌కి ఎందుకనో ఇది నచ్చలేదు. హెడ్మాష్టరు తనని 'కొట్టటం వేరు, ఇట్లా అరవటం వేరు' అనిపించి, వాడికి చాలా బాధ వేసింది. ఆ సంగతి వాడు వాడి మిత్రులకు చెబితే వాళ్ళు కూడా బాధపడి, "అరే! నిజంగానే నీకు చదువు అంటే ఇష్టం లేదు

కదా? నీకు క్రికెట్ అంటే కదా, ఇష్టం ..? మరి ఇంక ఇక్కడ బడిని పట్టుకొని వ్రేలాడేది ఎందుకు? సెలవల్లో సెలక్షన్లు అవుతాయట- వచ్చే సంవత్సరం నుండీ క్రికెట్ కోచింగ్ కి పో రా! అదే నయం!" అన్నారు.




"సరేరా! అట్లాగే చేస్తా! నేను 2026 వరకూ క్రికెట్‌నే ఆడతా; మంచి క్రికెటర్ ని అవుతా; చూస్తూండండి!" అన్నాడు యశ్వంత్.

ఆ సంవత్సరం పరీక్షలు కూడా రాయలేదు యశ్వంత్. మరుసటి ఏడాది వాడు బడికి రాలేదు. అటు తర్వాత అందరూ వాడి గురించి మర్చిపోయారు.

కొన్ని సంవత్సరాలు గడిచాక, ఒక రోజున యశ్వంత్ వాళ్ళ మిత్రులకు అందరికీ ఫోన్లు వచ్చాయి- "సాయంత్రం టీవీ ఆన్ చేసి క్రికెట్ చూడండిరా, అంతా! నేనెవరో తెలుస్తుంది" అని.

ఎవ్వరికీ ఏమీ అర్థం కాలేదు. కానీ వాళ్లంతా టీవీ చూసి, గుర్తుపట్టారు! అక్కడ ఆడుతున్న కుర్రవాడు యశ్వంత్! వరస పెట్టి సిక్సులూ, ఫోర్లూ కొడుతున్నాడు! స్టేడియంలో ఉన్న వాళ్ళంతా ఉత్సాహంగా చప్పట్లు కొడుతూ మెచ్చుకుంటున్నారు! మిత్రుల ఆనందానికి అవధులు లేవు! "మన ఊరి పిల్లాడురా, వాడు! యశ్వంత్- మన ఊరి వాడే!" అని అందరికీ చెప్పుకున్నారు.




ఆ తరవాత ఒకనాడు ఊరికి వచ్చిన యశ్వంత్‌కి బడిలో ఘనంగా సన్మానం

జరిగింది. అప్పుడు వాడు స్నేహితులను మెచ్చుకుంటూ "అరే! మీరు నాకు చేసిన మేలు అంతా ఇంతా కాదురా! నన్ను కోచింగుకు పంపింది మీరే! మీ సలహానే నన్ను ఇప్పుడు ఇంతవాణ్ణి చేసింది!" అన్నాడు. అప్పుడు మిత్రులు "మేము నిన్ను ఎంత వెళ్ళమని అన్నా నీ కృషి లేనిదే ఏదీ కాదురా!" అన్నారు.

ఆ రోజు బడిలో ఉండగా యశ్వంత్‌కి ఒక ఐడియా వచ్చింది. 'తను ఒక మంచి 'స్పోర్ట్స్ అకాడమీ' పెట్టాలి.. తనలాగా ఆటలు అంటే ఇష్టం ఉండే పల్లె పిల్లలకు సరైన దారి చూపించాలి. వారికి సరైన శిక్షణనిచ్చి, బలంగా తయారు చేయాలి!' అని. త్వరలోనే అతను దాన్ని అమలు పరచాడు. అట్లా ప్రారంభమైన "యశ" స్పోర్ట్స్ అకాడమీ ఎంతో మంది పిల్లలకు మార్గదర్శని అయింది!

**క్రికెట్ క్విజ్!**

మీకు తెలుసా?

1. క్రికెట్ ఎప్పుడు పుట్టింది? ఏ దేశంలో?
2. T20 క్రికెట్ కు ఆ పేరు ఎందుకొచ్చింది? టీ ట్వెంటీ మ్యాచులు ఎంత సేపు జరుగుతాయి?
3. ఒక్కో క్రికెట్ టీంలోను ఎందరు ఆటగాళ్ళు ఉంటారు?

**సమాధానాలు:**

1. క్రికెట్ ఆట 18వ శతాబ్దంలో ఆగ్నేయ ఇంగ్లాండ్ లో మొదలైంది.
2. అది ట్వెంటీ ట్వెంటీ క్రికెట్ మ్యాచ్ కు సంక్షిప్త రూపం. ఈ రకం ఆటలో రెండు టీములూ చెరొక ఇరవై ఓవర్ల బంతులను మాత్రమే ఎదుర్కొంటాయి గనక ఆ పేరు.
3. క్రికెట్ టీంలో పదకొండు మంది ఆటగాళ్ళు ఉంటారు. అయితే పన్నెండవ ఆటగాడిని అదనపు ఆటగాడుగా ఉంచుకుంటారు. అవసరాన్ని బట్టి పన్నెండవ వాడిని ఆడనిస్తారు.




# ధైర్యం

*రచన: సాముల శ్రీకాంత్ రెడ్డి, 10 వ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ.*

నల్లమల అడవులలో సంభి అనే గిరిజన గ్రామం ఉండేది. అక్కడి గిరిజనులు ధైర్యసాహసాలకు పెట్టింది పేరు.

నల్లమల అడవులలో ప్రకృతి ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది. పచ్చని ఎత్తైన చెట్లు, గుబుర్లతో నిండిన కొండలు, లోయలు, అక్కడక్కడా జలపాతాలతో వాతావరణం మనోహరంగా ఉంటుంది.

అయితే దట్టమైన అడవి కాబట్టి అక్కడ పులుల భయం కూడా ఎక్కువే. సామాన్యంగా అడవులలో తిరిగే పులులు, ఒక్కోసారి నీళ్ళ కోసమనో, అడవులకు నిప్పు అంటుకోవటం వల్లనో తాము మామూలుగా తిరిగే ప్రాంతాలను వదిలి, జనావాసాలలోనికి వస్తుంటాయి. ఒకసారి వచ్చాక, అవి తిరిగి అడవిలోకి వెళ్ళక, సమస్యలై కూర్చుంటాయి.

ఒక సమయంలో అట్లా ఒక పులి వచ్చింది.

గిరిజనులు పెంచుకునే ఆవులనూ, మేకలనూ చంపి తినటం మొదలు పెట్టింది. ఒంటరిగా దొరికితే పిల్లల్ని, ముసలివాళ్లని వదలట్లేదు. ప్రజలు సుఖంగా నిద్రపోక చాలా రోజులయ్యింది, ఆ పులి వల్ల!



సామాన్యంగా అడవి జంతువులతో ఒక రకమైన సమత్వాన్ని పాటించే ఊళ్ళోవాళ్ళు కూడా ఇప్పుడిప్పుడే ఒక నిర్ణయానికి వస్తున్నారు- 'పులిని చంపాలి, లేదా పట్టి బంధించాలి' అని.

ఆ గిరిజన తాండాకు చెందిన కృష్ణ అనే అబ్బాయి పట్టణంలో చదువుకునేవాడు. వాళ్లకు ఉండే రెండు గొర్రెల్నీ పులి ఎత్తుకుపోయింది. దాంతో వాడు ఊరి పెద్దలతో చర్చలు పెట్టుకున్నాడు. "చంపేద్దాం పట్టు" అన్నారు కొందరు. "ముందు దాన్ని ప్రాణాలతో పట్టుకునే ప్రయత్నం చేద్దాం. ఫారెస్టు వాళ్ళతో గొడవ లేకుండా ఉంటుంది. అంతగా కాకపోతే ఇక మీరు చెప్పినట్లు చేద్దాం" అన్నాడు కృష్ణ.

ఊళ్ళో వాళ్ళు అంతా కలిసి ఒక పెద్ద బోను తయారుచేసి, ఊరి ముందు పెట్టారు. పులిని ఆకర్షించేందుకుగాను ఆ బోనులో ఒక మేకను కూడా పెట్టారు.

అయితే పులి తెలివైనది. ఊళ్ళో జనాల ఇళ్లలో ఉన్న మేకల్ని ఎత్తుకు పోతున్నది గాని, బోనులో పెట్టిన మేక కోసం రావట్లేదు.

ఊరిలో చాలామందికి పులుల్ని పట్టిన అనుభవం ఉంటుంది. అట్లా అనుభవం ఉన్న ఒకాయన చెప్పాడు : "పులిని చంపాలంటే వాటి దగ్గరికి మనం వెళ్ళాలి, ఊరికే వాటిని రమ్మంటే అవి రావు" అని.

దానిని అనుసరించి, బోను ఉండే స్థలాన్ని అడవి లోపలికి మార్చాడు కృష్ణ.



చదువుకున్నవాడు కాబట్టి, పులి అడుగుజాడలు ఉన్న ప్రదేశాలని మ్యాపు మీద గీసి, దాని స్థావరం ఎక్కడ ఉండచ్చో ఊహించాడు. ఆ స్థానానికి, ఊరికి మధ్యలో బోనును పెట్టించాడు. "ఇవాళ్ళే పులి దొరికేది" అంటూ ఊరి వాళ్లని ఆ చుట్టు ప్రక్కల చెట్లమీదికి ఎక్కించాడు. తను బల్లెం పట్టుకొని, పులిని వెతుక్కుంటూ అడవిలోకి పోయాడు.

అతని ఊహ నిజమే అయ్యింది: కొద్ది దూరం పోయే సరికే అతనికి పులి ఎదురైంది. కృష్ణ చటుక్కున వెనక్కితిరిగి ఊరివైపుకు పరుగు మొదలు పెట్టాడు. రెచ్చిపోయిన పులి గర్జిస్తూ అతని వెంట పడింది. కృష్ణ ఆ తుప్ప మీదినుండి, ఈ మొక్క మీదినుండి దూకి, చివరికి బోను దగ్గరకు వచ్చి, బోను ముందే నిలబడ్డాడు. చెట్లమీద బల్లేలతో కూర్చున్న పల్లెవాళ్ళు నివ్వెరపోయారు. పులి గట్టిగా గాండ్రించి ఒక్కసారిగా కృష్ణ మీదికి దూకింది!

అయితే ఆ అదను కోసమే నిలబడ్డ కృష్ణ, చటుక్కున పక్కకు వంగాడు. పులి నేరుగా బోనులో పడ్డది!




అతని ధైర్య సాహసాలను ఊళ్ళోవాళ్లంతా మెచ్చుకున్నారు. పులిని అటవీశాఖ అధికా-రులకు అప్పగించారు. 



# అడవిలో సాహసం

*అమ్మో! అడవిలో తప్పిపోయి ప్రాణాలతో బయటపడాలంటే నిజంగానే చాలా సంగతులు తెలిసి ఉండాలి!*
*రచన: యమ్.విజయాదిత్య, 8 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు*

అడవిలో అద్భుతంగా కనిపించే విషపు పూలు ఉంటాయి; చాలా ముద్దుగొలిపే మాంసాహార జీవులు, క్రూర మృగాలు ఉంటాయి.

మేం అందరం ఒకసారి అట్లాంటి ఓ అడవిలో చిక్కుకుపోయాం. ఇప్పుడు ఆ సంగతులు తలచుకుంటే 'అయ్య బాబోయ్' అనిపిస్తుంది.

మా బాబాయి వాళ్ళు ఆఫ్రికాలో ఉంటారు. పోయిన ఏడాది సెలవల్లో మేం వాళ్ళింటికి వెళ్ళాం. "ఆఫ్రికాలో ఉన్నన్ని దట్టమైన అడవులు మరెక్కడా ఉండవు. ఆఫ్రికన్ సఫారీ ప్రపంచ ప్రసిద్ధి గాంచింది. నిజంగా అట్లాంటి అనుభవం మాటల్లో చెప్పలేం" అన్నాడు బాబాయి తన్మయత్వంతో కళ్ళు

మూసుకొని. దాంతో ఇంకేముంది, అందరం ఎగిరి గంతేసి బయలుదేరాం.



"సఫారీ" అనే పద్ధతే అసలు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. అడవిలో జంతువులన్నీ వాటి ఇష్టం వచ్చినట్లు తిరుగుతూ ఉంటాయి. మనుషులు కార్లలోను, వ్యాన్లలోను కూర్చొని ఆ అడవిలో తిరుగుతారు. ఒక్కోసారి అవి వ్యానులకు చాలా దగ్గరగా కూడా వస్తాయి. అయితే వ్యాన్ల కిటికీలకు అన్నిటికీ ఇనప వలలు ఉంటాయి కాబట్టి అంత భయపడే అవసరం ఉండదు.

అందరం సఫారీ టిక్కెట్లు కొనుక్కున్నాం. ఆ టిక్కెట్లు చూపిస్తే గార్డులు అందరినీ గేటు లోపలికి వదిలారు. తరవాత పిల్లలని, పెద్దవాళ్ళని వేరు వేరు వ్యానులలో కూర్చోపెట్టి అడవిలోనికి పంపించారు.

మా వ్యాను డ్రైవర్ పేరు బిల్. అతను దృఢంగా , నల్లటి జుట్టుతో, తెల్లని చర్మంతో, చేతిలో రైఫిల్ పట్టుకొని ఉన్నాడు భయం పుట్టేట్లు. కానీ అతను మమ్మల్ని పలకరించిన తీరు చూస్తే మటుకు చాలా బాగా అనిపించింది. బలే స్నేహంగా ఉన్నాడు.

వ్యాను క్రమక్రమంగా అడవిలో చాలా లోపలికే పోయింది. నక్కలు-తోడేళ్ళు, జింకలు, అడవి దున్నలు, రకరకాల పక్షులు, అక్కడక్కడా కొన్ని పులులు- అన్నీ కనిపిస్తున్నాయి. చూస్తూండగానే చుట్టూ అంతా చీకటి అలుముకున్నది- అంత దట్టంగా ఉన్నాయి చెట్లు.

దగ్గర్లోనే ఏదో సరస్సు ఉండి ఉంటుంది. గాలి వాసన తేమగా, ఒక రకంగా బరువుగా వస్తోంది.

అక్కడ ఒక చోట వ్యానును ఆపి ఇంజన్ ఆఫ్ చేసాడు బిల్. "ఏ మాత్రం చప్పుడు

చేయకుండా- నిశ్శబ్దంగా వినండి- ఈ ప్రాంతంలో వేరే త్రాగు నీళ్ళ ఆధారం లేదు. అందుకని రకరకాల జంతువులు నీళ్లకోసం ఇటువైపుగానే వస్తాయి. మనం ఇక్కడ కొద్దిసేపు ఆగుదాం" అన్నాడు.



మేము అందరం నిశ్శబ్దంగా కూర్చున్నాం, అన్ని వైపులకూ జాగ్రత్తగా చూస్తూ. ఎక్కడా ఆకు కూడా కదలట్లేదు. ఆ సమయంలో కొంచెం దాహం అనిపిస్తే నీళ్లు తాగుదామని నా వాటర్ బాటిల్ తీసాను. మూత తీస్తుండగానే  బాటిల్‌లో నీళ్ళు వణకటం మొదలు పెట్టాయి! ముందు నా చెయ్యి వణుకుతున్నదేమో అనుకున్నాను గానీ, చూస్తే బస్సు మొత్తంగానే వణుకుతున్నది! అనుమానంతో నిలబడి  చెట్ల మధ్యన ఉన్న సందుల్లోంచి అవతలికి చూసాను: చూస్తే కొంచెం ఆవలగా  ఓ ఏనుగుల గుంపు! నీళ్ళు చిమ్ముకుంటూ ఇటువైపే వస్తున్నది!

"బిల్!ఏనుగుల గుంపు! వ్యాను స్టార్ట్ చెయ్యి! గబగబా పోనియ్యి!" అరిచాను నేను. బిల్ హడావిడిగా వ్యాను స్టార్ట్ చెయ్యబోయాడు గానీ, దానికేమైందో ఏమో- అది "గుయ్య్ గుయ్య్" మన్నది తప్ప స్టార్ట్ అవ్వలేదు.

నేను వెంటనే నాసంచిని తీసుకొని వ్యాను దిగేస్తూ అరిచాను: "అందరూ! త్వరత్వరగా మీమీ వస్తువులు తీసుకొని బస్సులోంచి దిగిపోండి! లేకపోతే ఏనుగుల తొక్కిసలాటలో మనం ఇంక మిగలము!" అని.

బస్సులో కలకలం మొదలైంది. ఒకరినొకరు నెట్టుకుంటూ, తోసుకుంటూ అందరూ గందరగోళంగా బస్సు దిగేసారు.. ఏనుగుల గుంపు మాకు చాలా దగ్గర్లోనే ఉన్నది. అడ్డు వచ్చిన చెట్లనల్లా ధ్వంసం చేసుకుంటూ మావైపే వస్తున్నది..

బిల్ మటుకు బస్సులోనే ఉన్నాడు. ఇంజన్ స్టార్టు చేసేందుకు ప్రయత్నిస్తున్నాడు. బస్సు దిగిన పిల్లలం అందరం మాకు ఎటు తోస్తే అటు పరుగు పెట్టాం. కొద్ది సేపు ప్రయత్నించిన తర్వాత బిల్ కూడా వ్యాను నుండి బయటకు దూకాడట మరి..

ఇక క్రిందికి దూకేసిన మేం పిల్లలం అందరం ఏనుగులు వచ్చే వైపుగా కాక, చెదురు మదురుగా వేరు వేరు వైపులకు పరుగు పెట్టాము. నేను, మా తమ్ముళ్ళు కృష్ణ, విష్ణు అలా తప్పించుకొనే ప్రయత్నంలో సూటిగా అడవిలోకే పరుగెత్తాము. ఎంత సేపు పరుగెత్తామో తెలీదు- ఎవ్వరమూ వెనక్కి మాత్రం చూడలేదు!

'ఇంక పరుగెత్తలేము' అన్నంత ఆయాసం వచ్చేంత వరకూ పరుగుపెట్టాక, అప్పుడు వెనక్కి తిరిగి చూసి, నెమ్మదించాం ముగ్గురం. ఏనుగులు మా వెంట పడట్లేదు. అయితే ఆ సరికి మాకు ఇక ఎక్కడున్నామో తెలీలేదు! అందరం అక్కడే ఓ చెట్టుక్రింద విశ్రాంతిగా కూర్చున్నాము.

"ఇప్పుడెలా?" అన్నాడు కృష్ణ.




"చూద్దాం" అన్నాను నేను. "అడవిలో ఏదో జరిగి ఉండాలి. ఏ వేటగాళ్ళో, గ్రామప్రజలో వాటిని భయపెట్టి ఉండాలి. మామూలుగా- నైతే ఏనుగులు పెద్ద శబ్దాలకు బెదురుతాయి. మీకెవరికైనా ఏమైనా శబ్దాలు వినబడ్డాయా?"

వాళ్ళిద్దరూ అడ్డంగా తల ఊపారు.

"ఇప్పుడు మనం ఏం తినాలి? అసలే ఆకలి వేస్తోంది. మధ్యాహ్నం దాటిపోయింది కూడా!" అన్నాడు విష్ణు బిక్కమొహం వేస్తూ.

"తినేందుకు ఏమున్నై, ఏమీ లేవు. అడవిలో ఆకులు తిందాంలే, ఆగు!" అన్నాడు కృష్ణ వాడిని సముదాయిస్తున్నట్లు. అంతలో నాకు గుర్తుకొచ్చింది- "చాలా ఏళ్ళ క్రితమే

మనిషి నిప్పుని తయారు చేయటం నేర్చుకున్నాడు. ఫ్రిక్షన్ ద్వారా నిప్పుని తయారు చేయచ్చు!" అని.

వెంటనే మా సైన్సు సర్ ని గుర్తుకు చేసుకొని, అక్కడ దగ్గర్లో ఉన్న ఎండు మొద్దుకి ఒక దానికి 'V' ఆకారంలో ఒక రంధ్రం చేసాడు కృష్ణ. నా దగ్గరున్న కటర్‌తో రెండడుగుల కట్టె ముక్కని ఒకదాన్ని కోసుగా చెక్కి, ఆ రంధ్రంలో పెట్టి తిప్పేందుకు అనువుగా చేసాను. విష్ణు వెళ్ళి అక్కడక్కడా ఉన్న బెరడు ముక్కలు, ఎండు గడ్డి ఏరుకొచ్చాడు. ముగ్గురం కలిసి కష్టపడి చిలికి, చివరికి ఒక చిన్న నిప్పుకణికని తయారు చేసాం. దాన్ని ఊది-ఊది, పెంచి-పెంచి, చివరికి దానితోటే రెండు కాగడాలు అంటించాం!

ఆ తర్వాత ముగ్గరమూ మండే కాగడాలు పట్టుకొని కొంచెం దూరాన ఉన్న వాగు దగ్గరికి వెళ్లాం! వాగులో నీళ్ళు ఏమంత వేగంగా పారటం లేదు. వాటిలోనే చేపలు గంతులు వేస్తున్నాయి. నీళ్లలో ఆడుకుంటూ ఆడుకుంటూనే తలా మూడు చేపలు పట్టాము. ఇక ఆ రాత్రి వాటిని కాల్చుకొని తిన్నాము.

"రాత్రికి మనం ఇక్కడే పడుకుంటాము" అన్నాను నేను.

"నాకు భయం.." అన్నాడు విష్ణు.

"మనకు ఏమీ కాదులే, చెట్టు మీదికి ఎక్కి కొమ్మల్లో పడుకుందాం. నువ్వు క్రింద పడకుండా కొమ్మలతో కట్టేస్తాం ఏమీ పర్లేదు" అని నవ్వాడు కృష్ణ.

అందరం ఓ పెద్ద చెట్టు ఎక్కి కొమ్మల్లో పడుకున్నాం.

నేను మధ్య మధ్య లేచి చూస్తూనే ఉన్నాను. తెల్లవారు జాము వరకూ కాగడాలు అంటిస్తూ వచ్చాను.

చూస్తూండగానే తెల్లవారింది. ముగ్గురం చెట్టు దిగి క్రిందికి వచ్చాము. కొలనులో నీళ్ళు త్రాగి వెనక్కి బయలుదేరాము. అట్లా ఒక రెండు మైళ్ళు నడిచిన తరువాత వింత కంపు ఒకటి వచ్చింది. "ఇక్కడ ఒక సింహం ఉంది"

అన్నాను నేను. కృష్ణ, విష్ణు ఇద్దరూ గుటకలు మ్రింగుతూ నిలబడి పోయారు. "గంటక్రితం ఇక్కడే ఉంది అది" గట్టిగా వాసన పీలుస్తూ చెప్పాను నేను.



వెళ్తున్న కొద్దీ వాసన ఎక్కువవుతున్నది.. మాకు అడుగులు ముందుకు పడట్లేదు. ఏ క్షణాన అయినా సింహం ఎదురు పడచ్చు.. కానీ వేరే వైపుకు వెళ్ళాలంటే ఇష్టం అవ్వలేదు- 'మేం వెళ్ళాల్సింది ఇటే' అని గట్టిగా అనిపిస్తున్నది.

సరిగ్గా ఆ క్షణానే బండ మీద సేద తీరుతున్న సింహం ఒకటి కనిపించింది మాకు. ఇక మా కాళ్ళు మా మాట వినలేదు. ఒకటే పరుగు పెట్టాయి.

త్వరలోనే మాకు ఘాట్ రోడ్డు కనబడింది. మేం వచ్చింది అటునుండే. మాకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. పరుగెత్తుతూనే ఘాట్‌రోడ్డుకు చేరాము. వెనక్కి చూస్తే సింహం లేదు! ఇప్పుడు ఆలోచిస్తే అనిపిస్తుంది- "అది బహుశ: అసలు మా వెంట పడనే లేదు- లేకపోతే దాని వేగం ముందు మేమెంత?" అని.

ఇంకో యాభై అడుగులు వేసామో, లేదో- మాకోసం వెతుక్కుంటూ వస్తున్న వ్యాన్లు ఎదురయ్యాయి. సఫారీ వాళ్ళు, పోలీసులు రాత్రంతా వెతుకుతూనే ఉన్నారట! దొరికిన పిల్లల్ని దొరికినట్లు బయట ఉన్న గెస్టు హౌసుకు చేర్చారట! అందరు పిల్లలూ క్షేమంగా ఉన్నారు- మేం ముగ్గురమేనట, వాళ్లకు దొరకనిది! అందరూ చాలా భయపడ్డారట!

సఫారీ వాళ్ళు మాకు క్షమాపణలు చెప్పుకున్నారు. 'ఏమైతేనేం వీళ్ళు క్షేమంగా తిరిగి వచ్చారు అంతే చాలు!' అని అమ్మ, నాన్న సంతోషపడ్డారు. ★




# సర్కస్ బొమ్మలు

బొమ్మకు కథ-1

రచన: ఎస్. శ్రీనివాస్, 8 వ తరగతి, అరవింద హై స్కూల్, కుంచనపల్లి





బాంబే, ఒక హైటెక్ సిటీ. అందులో పేరుమోసిన సర్కస్ ఒకటి ఉంది. అందులో ఎన్నో జంతువులు- రకరకాల ట్రిక్స్ చేసేవి- ఉండేవి. ఉయ్యాలలూగే కోతులు, నవ్వించే ఒరాంగుటాన్, విన్యాసాలు చేసే పులి- ఇవన్నీ చూసేందుకు పిల్లలు ఎగబడే వాళ్ళు. ఆ సర్కస్ తమ ఊరు వచ్చిందంటే జనాలకు పండుగలాగా ఉండేది.

కానీ ఎవరికీ తెలియని విషయం ఒకటి ఉంది: ఆ సర్కస్ లో జంతువులను హింసిస్తారు.

"హింసించకపోతే క్రూరమృగాలు మాట వినవు! వాటి చేత మాట వినిపించాలంటే వాటికి అన్నం పెట్టకుండా మాడ్చాలి! కొరడాలతో కొట్టాలి!" అని వాళ్ల నమ్మకం. ఆ నమ్మకంలో కొంత నిజం ఉంది కూడాను.

సర్కసులో ఉన్న అనేక జంతువుల్లో ఒక ఏనుగు కూడా ఉండేది. దాని పేరు మోనా.

ఒకసారి సర్కస్ నడిపే మాస్టర్ చెప్పిన మాట వినలేదని దాన్ని ఒక మూలన కట్టి పడేసాడు, మేత-నీళ్ళు ఏమీ ఇవ్వకుండా మాడ్చాడు. దాంతో అప్పటికే కడుపుతో ఉన్న మోనా పాపం, ఒక బిడ్డను కని, చనిపోయింది!




ఆ బిడ్డకు 'రాక్' అని పేరు పెట్టారు.

చిన్నపిల్ల అని జాలి, దయా కూడా లేకుండా, ఇంకా సరిగ్గా నడవటం కూడా రాకముందే, తాడు మీద, సన్న సన్న గోడల మీద నడిచే శిక్షణనివ్వటంం మొదలు పెట్టారు దానికి. అయితే అది చాలా మంచిది- త్వరలోనే తాడు మీద నడిచే విద్యను నేర్చేసుకున్నది. "ఏనుగుపిల్ల చాలా బాగా నడుస్తుందట!" అని సర్కస్ వాళ్ళు ప్రచారం చేసుకున్నారు. దాంతో 'రాక్'ని చూసేందుకే సర్కస్‌కు వచ్చే జనాలు ఎక్కువైనారు.

అయినా 'రాక్' కు హింస తప్పలేదు. మరిన్ని కొత్త విద్యలు నేర్చుకోవాలని మాస్టర్లు దాన్ని బలవంత పెడుతూనే ఉన్నారు.

విసిగిపోయిన 'రాక్' ఒక రోజున సర్కస్ నుండి తప్పించుకొని పారిపోయింది!

సర్కస్ లోంచి అయితే బయటికి వచ్చింది గానీ, రాక్ కు ఎటుపోవాలో తెలీదు. జనాలు ఎవ్వరికీ దాని భాష, దాని బాధ తెలియదు. అయితే దాని అదృష్టం కొద్దీ అది ప్రముఖ వైల్డ్ ఎక్స్ పర్ట్ 'రాణి' కంట పడింది.

రాణికి జంతువులంటే ప్రేమ. వాటి భావం, వాటి కన్నీటికి అర్థం తెలుసు ఆమెకు. ఆమె 'రాక్' పై ఉన్న వాతల్ని, దాని కన్నీటి చారల్ని చూసి దాన్ని అర్థం చేసుకున్నది.

దానితో స్నేహం చేసింది, పరిశోధించి, దాని వివరాలన్నీ కనుక్కున్నది. ఎవ్వరూ దాన్ని హింసించకుండా అడ్డుకున్నది. "దాన్ని,

దానిలాంటి ఇతర జంతువులను కాపాడాలి" అని పత్రికల్లో రాసింది.



సర్కస్ కంపెనీలు ఆమెకు వ్యతిరేకంగా చాలా ప్రచారం చేసాయి కానీ, చివరికి రాణి మాటల్లో సత్యం ఉందని అందరూ గ్రహించారు.

గవర్నమెంటు వారు కూడా 'ఆనిమల్ రైట్స్'ని గుర్తించారు.

'మానవులు తమ వినోదం కోసం జంతువులను ఆడించరాదు' అని చట్టం వచ్చింది. సర్కస్‌లలో 'జంతువులని వాడుకోవటం' అనే దురాచారానికి తెర పడింది. ఆనాటి నుండీ సర్కస్‌లలో జంతువులను ఆడించి సొమ్ము చేసుకోవటం తగ్గిపోయింది!



**తాళాలకోసం!**



రాము: మా నాన్నకు నా మీద బొత్తిగా నమ్మకం లేదని తేలిపోయిందిరా..!

సూరి: ఏమయ్యిందేంటి..? ఎందుకలా అంటున్నావు..?

రాము: ఏం లేదురా.. పొద్దునే మూర్ఛ వచ్చినట్లు నాటకమాడాను. దగ్గర్లో బీరువా తాళం ఉన్నప్పటికీ ఇల్లంతా వెతికి ఓ పనికిరాని ఇనుపముక్క తెచ్చి నా చేతిలో పెట్టాడురా..?!

**భూగోళం పాఠం!**

బాటసారి : బాబూ! ఈ రోడ్డెక్కడికిపోతుంది!

వ్యక్తి: తిన్నగా పోతే దక్షిణానికి. అటు తిన్నగాపోతే ఉత్తరానికి తర్వత తూర్పుకు, ఆఖరుకు పడమరకు తిరిగి చివరకు యిక్కడికే వస్తుంది బాబూ!




# బడికి పోదాం!

*పేద తల్లిదండ్రులు పిల్లల్ని బడికి ఎందుకు పంపరు ?*

*రచన: రేష్మిత, 5 వ తరగతి, వికాసవిద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*

అది ఒక సాయంత్రం. పిల్లలందరూ బడి నుంచి ఇంటికి సంతోషంగా తిరిగి వస్తున్నారు.

కానీ రోడ్డు మీద ఒక ప్రక్కగా నిలబడ్డ ఒక అక్క, తన తమ్ముడితో అంటున్నది: "మనం కూడా అందరి లాగా బడికి వెళ్తే బాగుంటుందిరా! కానీ నాన్న ఒప్పుకోడు!" అని.

"మనం ఇంకోసారి నాన్నని అడిగి చూద్దాంలేవే!" అన్నాడు తమ్ముడు. ,

ఆ తర్వాత ఇద్దరూ వాళ్ళు అమ్మ దగ్గరికి పోయి, "అమ్మా మేం కూడా బడికి వెళ్తాం అమ్మా!" అని అడిగారు.

అమ్మ అంది, "నేను సంపాదిస్తానా, ఏంటి? సంపాదించేది మీ నాన్న! వెళ్ళి నాన్నను అడగండి!" అని.

వాళ్ళు నాన్న దగ్గరికి వెళ్లి అడిగారు- "నాన్నా! మేం బడికి వెళ్తాం నాన్నా!" అని.



"ఎలా వెళ్తారు? మన దగ్గర డబ్బులు కూడా చాలా కొన్నే ఉన్నాయి కదా? అంత డబ్బు మీ బడికే కట్టేస్తే, మరి మనం తినేందుకు తిండి ఎక్కడినుండి వస్తుంది?..మీరు ఇక్కడే ఉండండి. తినేందుకు ఏదైనా తిండి తెస్తాను" అని వాళ్ల నాన్న కొంచెం అవతలికి వెళ్ళాడు. పిల్లలిద్దరూ అక్కడే దిగులుగా కూర్చొని ఉన్నారు.

అంతలో వర్షం మొదలైంది. జోరుగా కురుస్తున్నది. రోడ్లన్నీ ఖాళీ అయ్యాయి. అందరూ ఎక్కడికక్కడ వెళ్ళి దాక్కున్నారు. కానీ ఈ పిల్లలు ఇద్దరూ మటుకు అక్కడే నిలబడి ఉన్నారు- వాళ్ళ నాన్న "వస్తాను- ఇక్కడే ఉండండి" అన్నాడుగా, అందుకని.

అంతలో ఒక ముసలాయన వచ్చి, "ఏంటి పిల్లలూ, వర్షం పడుతూ ఉంటే ఇక్కడ తడుస్తున్నారు?! తడవకూడదు రండి!" అని వాళ్ళ చెయ్యి పట్టుకుని ఎదురుగుండా ఉన్న టీ షాపుకు తీసుకుని వెళ్ళాడు.

"వేడి వేడిగా రెండు టీలు చేసి ఇవ్వు, వీళ్లకు!" అన్నాడు షాపతనితో.

టీ తాగుతూ ముసలాయనకు తమ గురించి చెప్పారు పిల్లలు. "మీ నాయన ఏం చేస్తాడు?" అడిగాడు ముసలాయన.

"ఏ పనంటే అది చేస్తాడు" చెప్పాడు తమ్ముడు.

"చదువు వొచ్చా?"

"రాదు"

"కానీలే, మరి మా ఆఫీసులో వాచ్ మ్యాన్ పని ఉంది. జీతంకూడా కొంచెం ఎక్కువే ఇస్తాను. పని చేస్తాడా?" అడిగాడు ముసలాయన.

"చేస్తాడు- జీతం ఎక్కువిస్తే ఏ పనైనా చేస్తాడు" అన్నది అక్క.

"అయితే రేపు మీ నాయన్ని ఈ 'టీ'షాపు ఆయన్ని కలవమనండి. నన్ను ఎక్కడ కలవాల్సిందీ రాసి ఇస్తాడు ఈయన" అని ముసలాయన వెళ్ళిపోయాడు. ఆరోజు వాళ్ళ నాన్న రాగానే టీ షాపతను టీ ఇచ్చి చెప్పాడు: మీ పిల్లలు నీకు పని వెతికి పెట్టారు" అని. "ఏం పని?" అడిగాడు నాన్న.



"ఆఫీసులో వాచ్‌మ్యాన్ పని! నీ పంట పండింది! చాలా డబ్బులు ఇస్తారు! నమ్మకంగా చేస్తావు గద?!" అడిగాడు టీ దుకాణం ఆయన.

"నమ్మకానికి మన దగ్గర కొదవే లేదు" అన్నాడు నాన్న.

"అయితే ముసలాయన ప్రత్యేకంగా చెప్పాడు: ఒక రూలు పెట్టాడు- మీ పిల్లల్ని బడికి పంపిస్తేనేనట, నీకు పని ఇచ్చేది-"

"డబ్బులు లేకనే కద, వాళ్లని బడికి పంపనిది?! మంచి జీతం ఇస్తే నేను ఎందుకు పంపను? వాళ్ళు చదువుకుంటేనే మేలు!" అన్నాడు నాన్న, ముసలాయన ఆఫీసు అడ్రసు తీసుకుంటూ.

మరునాటి రోజున నాన్న పనిలో చేరాడు. ఆ తర్వాతి రోజున పిల్లలిద్దరూ బడిలో చేరారు.

**గొప్ప అనుభవం!**



హీరో: నా దగ్గర 'మేకప్ మ్యాన్'గా పని చేస్తానంటున్నావు... అనుభవం ఉందా..?

పేరయ్య: ఉందండి సారూ... గత పదిహేనేళ్ళుగా తాపీ మేస్త్రీగా పని చేస్తున్నా..!




# మంచిమిత్రులు

బొమ్మకు కథ--2

*రచన: ఆర్. శ్రీకాంత్, 8 వ తరగతి, అరవింద హై స్కూల్, కుంచనపల్లి*





అనగనగా ఒక ఊరు. ఆ ఊరు చుట్టూరా అడవి. ఆ ఊరి పెద్ద, శ్రీరాములు చాలా మంచివాడు. ఊరికి కావలసిన అన్ని సౌకర్యాలనూ కల్పించాడు. ఊళ్ళో వాళ్ళు కూడా తమ వంతుగా కట్టవలసిన పన్నులన్నింటినీ ఆలస్యం లేకుండా చెల్లించేసేవాళ్ళు. అట్లా వచ్చిన మొత్తాలను ఆయన ఒక గుహలో భద్రంగా దాచిపెట్టేవాడు. ఆ గుహ తలుపులు తీసేందుకు కూడా శ్రీరాములు ఒక జాగ్రత్త తీసుకున్నాడు. వాటి తాళాలు తెరుచుకోవాలంటే ఆయన కూతురు-సుజాత చేతిగుర్తులు కావాలి!

ఆ రోజుల్లో దేశంలో అంతటా బందిపోటు దొంగల తాకిడి ఎక్కువగా ఉండేది. ఒకసారి వాళ్ళు ఊరిమీద పడి, భీభత్సం సృష్టించారు. కనబడిన సొమ్ములు దోచుకున్నారు. ఎదిరించిన వాళ్ళను

చంపారు. కొన్ని ఇళ్ళను తగలబెట్టారు; కొన్నింటిని స్వాధీనం చేసుకున్నారు. వాళ్ళు ఊరిపెద్ద ఇంటి వరకూ వచ్చేసరికి ఖాళీ గోడలు వాళ్లను వెక్కిరించాయి.

శ్రీరాములు సుజాతను ఎత్తుకొని అడవిలోకి పారిపోయాడు.




దొంగలు ఊరుకుంటారా? వాళ్ళు ఆయన్ని వెంబడించారు. భయంతో పరుగు పెడుతున్న శ్రీరాములు ఒక చోట జారి పడిపోయాడు! ఆయన చేతుల్లోంచి జారిన సుజాత నేరుగా లోయలోకి పడిపోయింది! శ్రీరాములు తేరుకునేలోగానే దొంగలు ఆయన్ని చుట్టుముట్టారు!

అందరూ ఆ పాప చనిపోయిందని అనుకున్నారు; కానీ నిజానికి సుజాత లోయ అడుగున ఉన్న ఓ చెట్టు కొమ్మల్లో పడింది. ఆ కొమ్మల్లో ఒక గ్రద్ద గూడు కట్టుకొని ఉంది. ఆకాశం నుండి సుజాత వచ్చి పడగానే గ్రద్ద ఆ పాపని కాళ్ళలో కరచుకొని తీసుకుపోయింది- జంతువుల సమావేశానికి.

అక్కడ చాలా జంతువులు సమావేశమై ఉన్నాయి. అవన్నీ సుజాతని చూసి చాలా ముచ్చట పడ్డాయి. అప్పుడు గ్రద్ద వాటిని ఉద్దేశించి "మనకు, మనుషులకు మధ్య సంబంధాలు బాగా చెడిపోతున్నాయి. వాటిని బాగు చేయాలంటే ఈ పాప లాంటి వాళ్ళు చాలా అవసరం. మీలో ఈ అమ్మాయిని ఎవరు పెంచే బాధ్యత ఎవరు తీసుకుంటారో వాళ్ళు ముందుకు రండి. మీవల్ల మన జంతు సమాజానికే కాదు, మనుషులకు కూడా మేలు జరుగుతుంది" అని.

జంతువులన్నీ ఆలోచనలో పడ్డాయి. పులులు, సింహాలు 'మేం మాంసాహారులం. ఎప్పుడో ఓసారి ఈ పాపను తినేయాలనిపించినా అనిపించచ్చు.




మేం పెంచుకోం' అన్నాయి. జింకలు, అడవి దున్నలు- 'మేం ఒకచోట ఉండనే ఉండం. మా వల్ల కాదు' అన్నాయి.

అప్పుడు ఒక భారీ ఏనుగు ముందుకు వచ్చింది- 'నేను పెంచుకుంటాను- నేను ఒంటరిదాన్నేగా, నాకూ తోడు అవసరం' అన్నది. మిగతా జంతువులన్నీ పాపను దీవించి, 'నీకు ఎలాంటి అవసరం ఉన్నా మాకు చెప్పు! వస్తాం" అని ఏనుగుకు చెప్పి వెళ్లి పోయాయి.

ఇక ఏనుగు ఆ పాపను తన మీద ఎక్కించుకొని ఇంటికి తీసుకువెళ్లింది. కొండపైన ఉండే ఒక కోటే, దాని ఇల్లు. ఏనుగు పాపని చాలా ముద్దుగా పెంచుకున్నది. పాప, ఏనుగు ఇద్దరూ కోట గోడమీద కూర్చొని రోజూ ఆకాశాన్ని, దూరంగా ఉన్న పట్టణాన్ని చూసేవాళ్ళు. అడవిలోని జంతువులు, పక్షులు అన్నీ సుజాతకు స్నేహితులయ్యాయి.

ఇక అక్కడ, బందిపోటు దొంగలు 'ఊరి డబ్బు ఎక్కడ దాచావు?' అని శ్రీరాములును చాలా వేధించారు. ఆయన్ని ఎత్తుకెళ్ళి చాలా కాలంపాటు తమ గుహలోనే బందీగా, బానిసగా పెట్టుకున్నారు.

అయినా శ్రీరాములు నోరు విప్పకపోవటంతో, చివరికి 'ఇక లాభం లేదు. వీడిని ఊరికే పోషించేది వృధా. చంపేద్దాం' అని నిశ్చయించుకొని, అడవికి తీసుకెళ్ళారు.

అది చూసిన పక్షులు కొన్ని సుజాత దగ్గరికి వచ్చి "సుజాతా! మీ నాన్నను బందిపోటువాళ్ళు చంపేయబోతున్నారు.



త్వరగా వచ్చి కాపాడుకో! పద పద! ముందు!" అని తొందర పెట్టాయి.

సుజాత తక్షణం వాటి వెంట బయలుదేరింది. ఆ పాప వెనకనే ఏనుగు, అడవిలోని మిగతా జంతువులు అన్నీ వెళ్ళాయి. వాటన్నిటి సహాయంతో సుజాత బందిపోట్లకు బుద్ధిచెప్పింది; తండ్రిని కాపాడుకున్నది!

దాంతో అడవిలోని జంతువులంటే ఊరి ప్రజలకు, ఊళ్ళో వాళ్లంటే అడవి జంతువులకు మంచి అభిప్రాయం కలిగింది. ఏనుగు, సుజాత విడదీయరాని మిత్రులైనారు. ఇక అటుతర్వాత బందిపోట్లు ఏనాడూ ఆ ఊరివైపుకు రాలేదు. అందరి సొమ్ము సురక్షితంగా ఉంది!

**ఆవాల నవ్వులు!**



డాక్టర్: ఆవాలు బరువు తగ్గడానికి చాలా బాగా ఉపయోగపడతాయి.

పేషెంట్: అవునాండి, డాక్టరు గారు! వాటిని ఎలా ఉపయోగించాలి?

డాక్టర్: ఒక కిలో ఆవాలు గిన్నెలో తీసుకోవాలి. తరవాత వాటిని కింద నేలమీద పడేయాలి. ఇప్పుడు కిందకు వంగి, ఒక్కొక్క ఆవాల గింజని ఏరి, మళ్ళీ అదే గిన్నెలో వేయాలి. ఇట్లా వారానికి మూడు సార్లు చేస్తే కచ్చితంగా బరువు తగ్గుతారు!!!




# మంచి రైతు

*రచన:సి.హెచ్.ఆవులరాజు, 7 వ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాలపల్లి*

దొండపాడు గ్రామంలో రాజు అనే పిల్లవాడొకడు ఉండేవాడు. వాడికి చదువు అంతగా రాదు; ఆటలు బాగా ఆడతాడు గానీ. ముఖ్యంగా వాడికి క్రికెట్ అంటే చాలా ఇష్టం.

పిల్లలంతా వాడిని 'మొద్దోడు' అని ఎగతాళి చేసేవాళ్ళు. వాళ్ళ అమ్మా. నాన్న కూడా ఎప్పుడూ తిడుతూనే ఉండేవాళ్ళు వాడిని: "నీకు అటు చదువూ రాదు; ఇటు పొలం పనులూ రావు! నువ్వు దేనికీ పనికి రావు!" అంటూ. అయినా అట్లాగే తరగతులు మారుతూ మారుతూ 10 వ తరగతికి చేరాడు రాజు.

పదో తరగతికి రాగానే ఇంటి వాళ్లతో పోరాడి, ఆ సంవత్సరం ఇక బడికి ఇంట్లోంచి రాకుండా హాస్టల్‌లో చేరాడు. హాస్టల్‌లో వాడిని తిట్టేవాళ్ళు ఎవ్వరూ లేరు. దాంతో వాడు చదువుమీద బాగా ధ్యాస

పెట్టగలిగాడు: "నేను ఎట్లా చదువుతాను?!" అన్న ఆలోచన వదిలేసి, "నేరుగా చదవటం" మొదలుపెట్టాడు వాడు. దాంతో పదో తరగతి పాసయ్యాడు!

అయితే దానికి ఇంట్లో వాళ్ళు బాధ పడ్డారు: "వీడిని ఇప్పుడు ఇంటర్లో చేర్చాలి, ఖర్మ" అంటూనే ఇంటర్లో చేర్చారు.




అట్లా అట్లా ఇంటర్ చదివాడు రాజు.

అటుపైన డిగ్రీలో "వ్యవసాయ చదువు" చదివాడు. అయితేనేం లాభం?! తను చదివిన చదువుతో ఉద్యోగం ఏమీ రాలేదు! కానీ వాడికి నిరాశ అనిపించలేదు. "ఇంక చదువు చాలు" అనుకొని, దొండపాడు తిరిగి వచ్చేసాడు. "ఇంకా ఉద్యోగం రాలేదా? నీకెక్కడ వస్తుందిలే!" అని ఎగతాళిగా మాట్లాడారు అందరూ.

తర్వాతి రోజున పొలానికి వెళ్ళాడు రాజు. వాళ్ళ నాన్నకు రెండెకరాల పొలం ఉంది. అయితే, దాన్నంతా పండించడం కష్టమయి, ఒక ఎకరంలోనే పంట వేసేవాడు ఆయన.

" నాన్నా! ఆ మరో ఎకరాలో నేను సొంతగా ఏదైనా పంట వేద్దామనుకుంటున్నాను" అన్నాడు రాజు,వాళ్ళ నాన్నతో.

"ఏమీ చేతకానోడివి ఏం పండిస్తావురా?" ఎక్కిరిస్తున్నట్లు అన్నాడు వాళ్ల నాన్న. అయినా రాజు ముఖంలో పట్టుదల చూసి, "సరే! అయినా ఆ ఎకరా ఎట్లాగూ ఖాళీయే! ఏమన్నా చావు! ఇప్పటికైనా నీకు చదువు రాదని ఒప్పుకున్నందుకు సంతోషం! కనీసం కూలీ చేయడమన్నా నేర్చుకో" అని తిట్టాడు.

రాజు అవి ఏమీ పట్టించుకోలేదు- తను చదువుకున్న చదువుని ఉపయోగించు-కుంటూ ఆ పొలంలో పంట వేశాడు. రాజు

వేసే పంటలు, మందులు, చేసే పనులు అన్నీ కొత్త కొత్తగా అనిపించాయి వాళ్ళ నాన్నకు. '




పిచ్చోడు- ఏంటేంటో చేస్తున్నాడు!' అని బాధ పడసాగాడు. ఊర్లో వాళ్ళు కూడా ఏవేవో ఊహించుకున్నారు. అయితే అట్లా ఆర్నెల్లు తిరిగే సరికి, అందరూ ఒకటే ఆశ్చర్యపోయారు: అందరూ రెండెకరాల్లో పండించే పంటని, రాజు ఒక్క ఎకరంలోనే పండించి చూపించాడు! ఇక ఆ రోజు నుండీ వాళ్ళ నాన్న కూడా రాజుని మెచ్చుకోసాగాడు.

ఈసారి రెండెకరాలూ తననే పండించమన్నాడు. అదనంగా ఆ చుట్టుప్రక్కల వాళ్ల పొలాల్ని కూడా కౌలుకు తీసుకుని అనేక రకాల పంటలు పండించి చూపాడు రాజు.

ఆ తర్వాతి ఏడాది రాజుకి పెళ్లి కూడా అయ్యింది. ఇప్పుడు రాజు ఒక మంచి రైతు! ఊళ్ళోవాళ్ళకు వ్యవసాయంలోఎలాంటి సందేహాలొచ్చినా రాజు దగ్గిరికి వచ్చి సలహాలు అడుగుతుంటారు! ★

పొడుపు కథలు

1. పొడువాటి మానుకి నీడే లేదు?
2. పైడిపెట్టెలో ముత్యపు గింజ?
3. ఇంతింత ఆకు, ఇంపైన ఆకు, రాజుల మెచ్చిన రత్నాల ఆకు?
4. అడ్డగోడమీద బుడ్డ చెంబు, తోసినా ఇటుపక్క పడదు. అటు పక్క పడదు?
5. మనిషికి రెండే కాళ్లు, ఏడు చేతులు?

*జవాబులు: 1. దారి, 2. వడ్లగింజ, 3. తమలపాకు, 4. ఆబోతు మూపురం, 5. నిచ్చెన*



# భయం-ధైర్యం

*రచన: తారా షెల్టర్ హోం పిల్లలు, న్యూ బోయిన పల్లి, హైదరాబాదు*
*సౌజన్యం: కుప్పిలి ఫణీంద్ర*

ఒక ఊళ్లో చిన్న గ్రంథాలయం ఒకటి ఉండేది. అక్కడి పుస్తకాలకి మామూలు పుస్తకాల లాగానే కాళ్లూ, చేతులూ,కళ్లూ, ముక్కు లాంటివి ఏవీ లేవు; కానీ వాటికి వినడం, మాట్లాడటం వచ్చు!

పైగా అది చాలా చిన్న గ్రంథాలయం కూడా: కాబట్టి మొదటినుండీ అవే పుస్తకాలు వున్నాయి. అందుకని అవి వేళా పాళా లేకుండా ఎప్పుడూ ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉండేవి.

వాటి మాటలు కూడా మన మాటల్లానే ఉండేవి. దాంతో వాటి మాటలు విన్న ఊళ్ళోవాళ్ళు 'ఈ గ్రంథాలయంలో దెయ్యాలున్నాయి బాబోయ్' అని అటువైపు రావడం మానేశారు. కానీ లైబ్రేరియన్ మాత్రం రోజూ భయపడుతూనే వచ్చి, కుర్చీ

బయట వేసుకొని కూర్చునేవాడు- లేదంటే జీతం రాదు మరి!

ఇట్లా కొన్నాళ్ళు గడిచే సరికి, తమనెవరూ పట్టించుకోవడం లేదని దిగులు మొదలైంది పుస్తకాలకి.




అంతే కాక, ఒక వారం రోజులుగా ఎలుకలు కూడా రావడం మొదలుపెట్టాయి! ఎలుకల అడుగుల చప్పుడు వినగానే పుస్తకాలన్నీ భయంతో బిర్ర బిగుసుకుపోయి, నిశ్శబ్దంగా ఉండటం మొదలు పెట్టాయి.

ఎలుకలు వచ్చి, ఎంచక్కా ఏదో ఒక పుస్తకాన్ని కాసేపు కొరుక్కొని వెళ్లిపోయేవి! ఆ ఎలుకల్ని లైబ్రేరియన్ కూడా చూశాడు; కానీ ఎలుకలు లోపలికి వెళ్లినప్పుడు లోపల్నుండి మాటలు వినపడట్లేదు. దాంతో అతను 'దెయ్యాలకు ఎలుకలంటే భయం కాబోలు' అనుకొని, ఎలుకల్ని తరమకుండా వదిలేశాడు.

ఇక ఆ ఊళ్లో అయితే జనాలు అందరూ గ్రంథాలయం గురించి పూర్తిగా మర్చిపోయే పరిస్థితి వచ్చింది.

అప్పుడు వచ్చారు, ఊళ్లోకి కొత్తగా- 5 వ తరగతి పిల్లలు! అందరూ అల్లరి వాళ్లే! కాకపోతే బాగా ఆడుకుంటారు; ఇంకా బాగా చదువుకుంటారు! బళ్లో పుస్తకాలే కాకుండా, కథల పుస్తకాలు కూడా చదవటం వాళ్ళకి ఇష్టం!

అట్లా వాళ్లు ఒకరోజున వీధిలో నడుస్తూ పోతుంటే గ్రంథాలయం కనిపించింది. "అరే! మన ఊళ్లో గ్రంథాలయం వుంది. మనకెవ్వరూ చెప్పలేదే! సరే వెళ్లి చూద్దాం పదండి!" అని లోపలికి వెళ్లారు. ఊళ్లో చాలా మంది గ్రంథాలయం గురించి అసలు మాట్లాడుకోవటం కూడా మానేశారు కదా,

అందుకని వీళ్ళకి కూడా ఎవరూ దెయ్యాల గురించి చెప్పలేదు. ఇక లైబ్రేరియన్ ఏమో వీళ్లని చూసి కూడా "లోపలికి వెళ్లాక దెయ్యాల మాటలు వినబడితే అప్పుడు వీళ్లకే తెలుస్తుందిలే; నేనెందుకు, చెప్పటం?' అని వీళ్లని ఆపలేదు.




పిల్లలు లోపల వున్న పుస్తకాల్ని చూసి "అరెరే! వీటిని ఎలుకలు కొట్టేసాయి! ఏమండీ లైబ్రేరియన్ గారు, ఇవెందుకండీ, ఇట్లా ఉన్నాయి. బాగు చేయచ్చుకదా? లోపలంతా దుమ్ము, బూజు ఉంది!" అన్నారు.

అప్పటికీ లైబ్రేరియన్ అసలు విషయం చెప్పలేదు. ఊరికే వీళ్ళని ఆట పట్టిద్దామని "నేనొక్కణ్ణే ఎన్నని చేయను పిల్లలూ?! మీకు అంత ఓపిక, సరదా ఉంటే మీరే చేసుకోండి గదా?! ఏమైనా సామాన్లు కావాలంటే చెప్పండి, తెప్పిస్తాను" అన్నాడు.

పిల్లలంతా కాసేపు తమలో తాము మాట్లాడుకొని, "సరే లెండి సార్! అయితే మాకు ఒక బూజు కర్ర, ఇంకా ఊడవడానికి, తుడవడానికి సామాను, కాసిని రంగు కాగితాలు తెప్పించండి. యీ లోపల మేం వెళ్లి యీ పుస్తకాలకు వేయడానికి అట్టలు, ఇంకా మాదగ్గర ఉన్న మరికొన్ని కథల పుస్తకాలు తీసుకొస్తాం, ఇంకో గంటలో" అని చెప్పి వెళ్లిపోయారు.

లైబ్రేరియన్ వాళ్లు అడిగిన సామాను తెచ్చి భయం భయంగానే లైబ్రరీ లోపల పెట్టి, మళ్లీ బైట కుర్చీలో కూర్చొని పేపరు చదువుకోసాగాడు. కొంత సేపటికి పిల్లలు తమదగ్గరున్న కథల పుస్తకాలు, అట్టలు తీసుకొచ్చారు. వెంటనే పనిలోకి దిగారు

కూడా. ముందు లోపల బూజంతా దులిపారు. అంతా ఊడ్చారు. పాత పుస్తకాల మీద వున్న దుమ్ము దులిపారు. వాటికి అట్టలు వేసారు. తాము తీసుకొచ్చిన కథల పుస్తకాలను ఒక అరలో సర్దారు. మొత్తం గ్రంథాలయాన్నంతా కడిగి, తుడిచారు. "రంగు కాగితాల్ని రేపు అతికిద్దాములే" అని అందరూ ఆడుకోవడానికి వెళ్ళి పోయారు.

అట్లా పాత పుస్తకాలకి తమను 'చాలా రోజుల నుండి మనుషులెవరూ కనీసం ముట్టుకోవటం కూడా లేదు' అనే బాధ తీరింది. పిల్లలు ఆడుకోవడానికి వెళ్లిన తర్వాత కాసేపటికి వాటికి కొంచెం ఓపిక వచ్చింది. ఐతే అవి 'మాట్లాడదాం' అనుకునే లోపే ఎలుకల అడుగుల చప్పుడు వినపడింది. చటుక్కున అన్నీ నిశ్శబ్దం అయిపోయాయి.

విచిత్రం ఏంటంటే, పిల్లలు తెచ్చిన కథల పుస్తకాలలో ఒకటి అసలు ఈ గ్రంథాలయం లోదే- చాలా రోజుల క్రితం దాన్ని ఎవరో తీసుకు వెళ్ళి, తిరిగి ఇవ్వటం మరచారు. అట్లా అది వాళ్ల పిల్లల్ని చేరి; చివరికి మళ్ళీ ఆ పిల్లల ద్వారా ఈ గ్రంథాలయానికే వచ్చింది. అయితే ఆ సంగతులేవీ ఆ పుస్తకానికి తెలీదు! అందుకే అది కూడా ఏమీ మాట్లాడలేదు. 'అసలు తను మాట్లాడగలదు' అన్న విషయాన్నే ఆ పుస్తకం మర్చిపోయింది పాపం.

కానీ అది కూడా అన్నీ వినగలదు కదా, అందుకని ఎలుకల అడుగుల చప్పుడు దానికి కూడా వినిపించింది. అయినా ఎప్పటి మాదిరి మామూలుగానే ఉంది.

ఎలుకలు వచ్చి, "ఇక్కడంతా మారిపోయింది- దుమ్ము దుశానం ఏమీ లేదు. అస్సలు బాలేదు" అని గొణుక్కున్నాయి. అంతలో వాటి చూపు కొత్తగా వచ్చిన పుస్తకాల మీద పడింది.

ఇన్ని రోజులుగా పాత పుస్తకాలు తినలేక ఉసూరు మంటున్న ఎలుకలకు, కొత్త పుస్తకాల్ని చూడగానే ప్రాణం లేచి వచ్చినట్లయింది. అవి ఇక కొత్తవాటి దగ్గరికి వచ్చి ఒక్కొక్క దాన్ని కొరికి రుచి చూడడం

మొదలు పెట్టాయి. అయితే మన కొత్త పుస్తకం ఇన్నాళ్ళూ నొప్పి అనేదే ఎరుగదు- పిల్లలు పాపం వాటిని జాగ్రత్తగా చూసుకున్నారు! అందుకని ఇప్పుడు ఎలుక కొరకగానే అది గట్టిగా "ఎవ్వర్రా అది, నన్ను కొరికింది?! అంతగా ఆకలి వేస్తే అన్నం తినండి, లేదంటే గడ్డి తినండి. పుస్తకాల్నా, తినేది?!" అని అరిచేసింది.

ఒక్కసారిగా అంత పెద్ద గొంతుతో అరుపు వినపడేసరికి ఎలుకలకి వణుకు మొదలై, పరుగో పరుగు! "ఇంక మళ్లీ ఆ పక్కకి రాకూడదు బాబూ!" అని అరుచుకుంటూ పారిపోయాయి.

కొత్తపుస్తకం కొత్త గొంతు విన్న పాత పుస్తకాలకి ఆశ్చర్యం వేసింది. ఎలుకలు పారిపోయేసరికి ఆనందం కూడా వేసింది. ఇక లైబ్రేరియన్‌కేమో మళ్ళీ భయం పట్టుకుంది. "దెయ్యాలు ఇప్పుడు ఎలుకల్ని కూడా బెదర గొట్టేశాయి- అయ్యో, ఏం చేసేది దేవుడా!" అని బయటే కూర్చొని వణకటం మొదలు పెట్టాడు.

ఇక పాత పుస్తకాలన్నీ "ఎవరది?! ఎలుకల్ని బెదరకొట్టిన ధైర్యవంతులు?!" అన్నాయి. దానికి "నేనే" అన్న సమాధానం వచ్చింది. మాటా మాటా కలిసాయి. అంతా చాలా సంతోష పడ్డారు.

అట్లా మాటలు ఎక్కువయ్యే సరికి, లైబ్రేరియన్ తిట్టుకుంటూ "పాడు దెయ్యాలు! మనుషుల్ని ఇక్కడకు రాకుండా చేస్తున్నాయి! ఇప్పుడు ఎలుకలను కూడా తరిమేసాయి! ఇంక దీనికి నిప్పంటించేస్తే, నేను కూడా హాయిగా ఇంటికి వెళ్లి ఏదో ఒక పని చేసుకొని బ్రతకొచ్చు. పీడా వదిలి పోతుంది!" అని గట్టిగా గొణుక్కుంటూ తన కుర్చీని మరింత దూరంగా రోడ్డు మీదికి జరుపుకొని కూర్చున్నాడు.

ఆ మాట విన్న పాత పుస్తకాలన్నీ 'నిజంగా తగలబెట్టేస్తాడేమో' అని భయంతో అరవసాగాయి.

అప్పుడు ఆ కొత్త కథల పుస్తకం అందర్నీ "ఆపండిరా, మీ గోల! అతను ఏమన్నాడో వినలేదా?! మన మాటల వల్లే

దెయ్యాలున్నాయని అందరూ భయపడు-తున్నారు. ఆలోచించి చూస్తే 'ఇన్నాళ్లూ నేను మాట్లాడకపోవటం వల్లనే పిల్లలు నన్ను చూసి భయపడకుండా నన్ను జాగ్రత్తగా చూసుకున్నారు' అనిపిస్తుంది.



మీరు వింటానంటే ఒక మాట చెప్తా. దానితో మీ కష్టాలన్నీ పోతై; మళ్లీ మనుషులు ఇక్కడికి వస్తారు; వచ్చి మిమ్మల్ని అందరినీ జాగ్రత్తగా చూసుకుంటారు" అన్నది.

మిగిలిన పుస్తకాలన్నీ "నువ్వేం చెప్తే అది చేస్తాం! చెప్పు!" అన్నాయి.

అప్పుడు అది "ఇప్పటినుండీ మనుషుల అడుగుల చప్పుడు వినగానే మనం మాట్లాడటం మానేద్దాం. అసలు రేపు ఉదయం నుండీ గ్రంథాలయం తలుపులు తెరవగానే మాట్లాడటం మానేద్దాం. సాయంత్రం గ్రంథాలయాన్ని పూర్తిగా మూసేసేంత వరకూ అస్సలు మాట్లాడకూడదు. ఆ తర్వాత కావాలంటే మాట్లాడుకుందాం. అది కూడా గోల గోలగా కాకుండా, బయటి వాళ్ళు ఎవ్వరికీ వినపడకుండా చిన్నగా! అట్లా కొన్ని రోజులు ఉంటే, అప్పుడు ఇంక 'దెయ్యాలు లేవురా!' అనుకుంటూ మనుషులు మళ్ళీ వచ్చి మళ్ళాడుతారు" అంది.

అన్ని పుస్తకాలూ "సరే" అన్నాయి.

మరుసటి రోజు పొద్దున తలుపు తెరవడానికి ముందే అన్ని పుస్తకాలూ నిశ్శబ్దంగా వున్నాయి. లైబ్రేరియన్ తలుపు తెరిచి కాసేపు చూసాడు- మాటలేమీ వినపడకపోయేసరికి అశ్చర్య పడ్డాడు! అంతలోనే పిల్లలు వచ్చారు. లోపల అన్నీ రంగు కాగితాలు

అతికించారు. చిన్న చిన్న బొమ్మలు తాము గీసిన వాటిని, తెచ్చిన వాటిని అక్కడక్కడా అతికించారు. ఆపైన అందరూ సంతోషంగా కాసేపు పుస్తకాలు చదువుకొని, ఆటలు ఆడుకునేందుకు వెళ్లిపోయారు. ఆ మొత్తం సమయంలోనూ ఒక్క పుస్తకం కూడా గొంతెత్తి మాట్లాడలేదు. పిల్లలు వెళ్లిపోయాక కూడా అవన్నీ మాటలు బయటికి వినపడకుండా మాట్లాడుకున్నాయి.

మాటలు వినపడకపోయే సరికి, లైబ్రేరియన్‌కి కొంచెం ధైర్యం వచ్చింది. రోడ్డు మీదనుండి తన కుర్చీని లోపలికి తెచ్చి కూర్చున్నాడు.

ఆరోజు ఇక సాయంత్రం వరకూ మాటలు వినపడలేదు; ఎలుకలు కూడా కనపడలేదు. దాంతో చాలా ఏళ్ల తర్వాత లైబ్రేరియన్ సంతోషంగా ఇంటికెళ్లాడు. పుస్తకాలన్నీ కూడా చాలా సంతోషపడ్డాయి. కొత్త పుస్తకానికి ధన్యవాదాలు తెలుపుకున్నాయి.

"నువ్వు అలా ఎలా అరిచావు? వాటిని భలే భయపెట్టావు! అంత ధైర్యం ఎక్కడిది, నీకు?" అని అడిగాయి.

దానికి అది "ధైర్యమా! నాకెక్కడిది? కాకపోతే నాకు భయం లేదు అంతే. అసలు కారణం ఏంటో తెలియకుండా ఊరికే భయపడటం మూర్ఖత్వం. ఊళ్లో వాళ్లకి అసలు 'మనం మట్లాడగలం' అని తెలియదు కదా, ఊరికే మాటలు మాత్రం వినబడేసరికి భయపడ్డారు! మీరేమో ఎలుకలు అనేవి ఏంటో తెలీక, మిమ్మల్ని కొరుకుతుండే సరికి భయపడ్డారు! ఇంక ఆ ఎలుకలేమో నేను మాట్లాడతానని, అరవగలనని తెలీక, నా మాటలు విని భయపడ్డాయి! నేనేమో అవేంటో తెలీకపోయినా, భయపడకుండా అరిచాను అంతే! కారణం తెలియకనే మనం చాలా వాటికి భయపడతాం. వెతికి కారణాలు కనుక్కోడానికి ధైర్యం ఉన్నా, లేకున్నా, భయం మాత్రం ఉండకూడదు" అని చెప్పింది. "నిజమే కదా" అని నవ్వుకున్నాయి అన్నీ.

ఇక ఆరోజునుండీ 5వ తరగతి పిల్లలు, లైబ్రేరియన్ కూడా- రోజూ వచ్చి గ్రంథాలయం లోపల కూర్చొని

చదువుకోవటం మొదలుపెట్టారు. కొన్నాళ్ళు వాళ్లని గమనించి, మెల్లగా ఊళ్లోవాళ్లు కూడా ఒక్కరొక్కరూ రావటం మొదలుపెట్టారు.

ఇప్పుడు గ్రంథాలయం నిండా పుస్తకాలు ఉన్నాయి! కొత్త అల్మార్లు ఉన్నాయి! పిల్లలు గీసిన బొమ్మలు ఉన్నాయి! వాళ్లు ఆడుకునే బొమ్మలకి పూర్తిగా ఒక గది కేటాయించారు! గ్రంథాలయం మొత్తం కళకళలాడుతున్నది.

నిజం ఎలా వున్నా, ఊరు ఊరంతా 5 వ తరగతి పిల్లల్ని "ఎంతైనా మీరు చాలా ధైర్యవంతులురా, ఒరే!" అని పొగిడింది.

అట్లా పొగిడినప్పుడల్లా వీళ్ళు అందరికీ కొత్త పుస్తకం చెప్పిన విషయమే చెప్పారు: "ధైర్యం ఉండటం కంటే, భయం లేకపోవటం చాలా ముఖ్యం! బహుశ: మాకు అంతగా భయం లేదు కావచ్చు" అని.



**సగం తెలివి!**



అనిల్: అదేంట్రా.. రెండూ ఒకే రకం పుస్తకాలెందుకు కొన్నావు?

కుమార్: ఈ పుస్తకం చేతిలో ఉంటే సగం పరీక్షలు పాసైనట్లే అని రాసుంది.అందుకే రెండు కొన్నాను.

**మంచి బేరగాడు!**

పేషెంట్: డాక్టరుగారు, ప్లాస్టిక్ సర్జరీ కి ఎంత ఖర్చు అవుతుంది..?

డాక్టర్: 50.000 వరకు అవుతుంది..

పేషెంట్: ఒకవేళా ప్లాస్టిక్ మేము తెచ్చుకుంటే...?

**సెలవులయ్య!**

రాము క్యాలెండర్ కావాలంటూ బజారుకెళ్ళాడు. దుకాణదారు క్యాలెండర్లు చూపిస్తుంటే ప్రతీ దాన్నీ వద్దుంటూ, 'ఇంకాస్త మంచిది ఇవ్వండి' అంటున్నాడు.

దుకాణదారు (చికాకుగా): ఇంతకీ నీ దృష్టిలో మంచిదంటే ఏంటి?

రాము: అంటే... స్కూలుకు సెలవులు బాగా ఇచ్చేలా ఎర్రరంగు గళ్ళు ఎక్కువుండాలి..



# పిల్లాడు - పిచ్చుక

*రచన: బి.వి.శివ శ్రావణి, 5 వ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాలపల్లి*

నది ఒడ్డున చెట్టు మీద రెండు పిచ్చుకలు ఉండేవి. అవి మంచి స్నేహితులు.

రెండూ కలిసి పుల్లలు తెచ్చుకున్నాయి; రెండూ కలిసి గూడు కట్టుకున్నాయి; చాలా కాలం కలిసి బ్రతికాయి.

ఒకనాడు ఉదయాన్నే ఒక పిచ్చుక నిద్ర లేచింది. చుట్టూ చూసింది. వాతావరణం చాలా బాగా అనిపించింది. నదిలో ఉన్న పూలను, మొక్కలను చూస్తూ సంబరపడింది.



నీళ్ళలో తన నీడ చూసుకుందామని, క్రిందకు వంగింది. అంతే- పొరపాటున కాలు జారి నదిలో పడిపోయింది!

నది బాగా వేగంగా పోతోంది; దానికి ఈత కూడా రాదు! దాంతో అది నదిలో కొట్టుకుపోయింది.

కొంచెం సేపటికి రెండవ పిచ్చుక నిద్రలేచింది. మిత్రుని కోసం చూసింది. మిత్రుడు లేడు. 'ఎక్కడికి వెళ్ళాడబ్బా ఇంత పొద్దున్నే?' అనుకుంది. ఎంత సేపు వేచి చూసినా స్నేహితుడు తిరిగి రాలేదు. చివరికి అది ఆందోళన పడింది. చుట్టూ వెతికింది.

తన ఫ్రెండ్ ఎక్కడా కనపడలేదు. అటూ ఇటూ ఎగిరి వెళ్ళి చూసింది. ఎక్కడా దొరకలేదు. బాధ పడుతూ ఒకచోట కూర్చుని ఏడుస్తున్నది.

అంతలో అటుగా వచ్చాడు రాము. వాడికి ఒక్క అవ్వ తప్ప వేరే ఎవ్వరూ లేరు.

"ఎందుకు ఏడుస్తున్నావ్?" అని అడిగాడు దూరం నుండే.

"నా ఫ్రెండ్ కనిపించట్లేదు" అన్నది పిచ్చుక.

"నా ఫ్రెండూ కనిపించట్లేదు. నేను ఏడుస్తున్నానా?" అన్నాడు రాము- "ఇదిగో, ఈ కాసిని సెనగలు ఉన్నై నా దగ్గర- తిను" అని దానికి వేస్తూ.




పిచ్చుక ఏమీ అనలేదు. సెనగలు తినలేదు.

"ఏడవకు" అని దాన్ని నిమిరాడు రాము.

"ఇకమీద నువ్వు-నేను ఒకరికొకరం స్నేహితులం సరేనా?" అన్నాడు.

పిచ్చుకకు ఏడుపొచ్చింది. కానీ దానికి రాము తన స్నేహితుడు అని అర్థం అయింది.





# సరైన నిర్ణయం

బొమ్మల కథ

*రచన : మూడవ తరగతి పిల్లలు , రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం*



కొండల మధ్యలో ఒక ఊరు ఉండేది. ఈత, తాటి, కొబ్బరి చెట్లతోటీ, పూల మొక్కలు-కూరగాయల పంటల తోటీ ఆ ఊరు చాలా అందంగా ఉండేది. ఊళ్ళో పిల్లలంతా వాళ్ల అమ్మానాన్నలకు పనుల్లో సాయం చేసేవాళ్ళు. తండ్రులు పంటలు పండించేవాళ్ళు; పిల్లలు పూలు కోసేవాళ్ళు; తల్లులు వాటిని అమ్ముకొచ్చేవాళ్ళు.

అమ్మా నాన్నలు పనులకు వెళ్లగానే, పిల్లలందరూ ఆటలకు పోయేవాళ్ళు. కొందరు తేనెటీగల వెంబడి, కొందరు ఈతకాయల వెంబడి, కొందరు గట్లు, చేన్ల వెంబడి.కొందరు చెట్లకు ఉయ్యాలలు కట్టి, ఎగురుకుంటూ, గంతులు వేసుకుంటూ, ఆటలాడుకుంటూ సంతోషంగా ఉండేవాళ్ళు. అయితే పెద్దవాళ్ళెవ్వరికీ సమయంలేదు- పిల్లలకు మంచి-చెడు నేర్పేందుకు.

ఓ సాయంకాలం పూట ఊరికి దగ్గర్లోనే ఒక పాము, పిల్లి కొట్లాడుకోవటం మొదలుపెట్టినై. పిల్లలు వాటి చుట్టూ మూగి చూస్తూ చప్పట్లు కొడుతున్నారు. అంతలోనే పిల్లి వెనక్కి తిరిగి పారిపోయింది. పాము దాని వెనకనే పరుగెత్తి, దగ్గర్లోని ఒక గుడిసెలోకి దూరింది.





పిల్లలంతా చెల్లా చెదరైపోయారు. 'పాము పాము!' అని కేకలు పెట్టారు. అయితే వాళ్ల అరుపులు వినేందుకు పెద్దవాళ్ళెవరూ ఊళ్ళో లేరుగా?

"మొన్న ఓసారి కంపల్లో పాము కనబడితే మా నాయన కంపకు నిప్పు పెట్టాడు!" అన్నాడొక పిల్లవాడు.

"పాముకు మంట అంటే భయం" అన్నాడు ఒకడు. ఇంకేముంది, పిల్లలంతా ఉత్సాహంగా పోయి, నిప్పులు తీసుకొచ్చి పాము దూరిన గుడిసెకు అంటించారు.

గుడిసె అంటుకొని భయంకరంగా మండుతోంది. పనులు పూర్తి చేసుకొని ఇళ్ళకి వస్తున్న పెద్దవాళ్ళంతా దాన్ని చూసి కంగారు పడ్డారు. గబగబా నీళ్ళు తీసుకొచ్చి మంటలను ఆర్పారు.



పిల్లల్ని పిలిచి కూర్చోబెట్టుకొని అడిగి జరిగిన సంగతి తెల్సుకున్నారు.

'చదువులు లేకపోతే ఇలాంటి సమస్యలు చాలా వస్తాయి' అని అర్థమైంది వాళ్లకి. 'దగ్గర్లో పెద్దవాళ్ళెవ్వరూ లేకుండా పిల్లల్ని మాత్రమే అట్లా ఒంటరిగా ఒదలకూడదు' అని కూడా తెలిసింది. అటుపైన వాళ్లంతా కలిసి ఊళ్ళో పిల్లలకు చదువు-మంచి చెడ్డలు నేర్పేందుకు బడి ఒకటి పెట్టుకున్నారు.

1. బద్ధకమే అసలు పాపం, అదే పేదరికానికి కారణం

2. మనిషికి వెలుగునిచ్చి మనోవికాసానికి తోడ్పడేది విద్య.

3. గమ్యం స్థిరంగా ఉండాలి, మార్గం ఖచ్చితంగా నిర్ణయించుకోవాలి, ప్రయత్నం రాజీలేని ధోరణిలో సాగాలి అపుడే విజయం మనదవుతుంది

4. నిరంతరం వెలిగే సూర్యుని చూసి చీకటి భయపడుతుంది. నిరంతరం శ్రమించేవాణ్ని చూసి ఓటమి భయపడుతుంది."

5. విలువైన వస్తువు విలువైన వారి దగ్గర ఉంటే దానికి మరింత విలువ పెరుగుతుంది.

6. నాటకం అన్ని కళలలోకి కష్టతరమైంది

7. అసత్యం కన్నా సత్యం అనంత రెట్లు బరువైనది, మంచితనం కూడా అంతే

8. "సిరి సంపదలు మంచితనాన్ని తీసుకురావు. మంచితనం మాత్రం అభిమానాన్ని దీవెనలను తీసుకువస్తుంది."

9. నీ ఆశయ సాధనలో వెయ్యిసార్లు విఫలం చెందినా ప్రయత్నం విరమించకు

10. ఓర్పుతో అసాధ్యమైన కార్యాన్ని సుసాధ్యం చెయ్యవచ్చు

11. మనిషి లక్ష్యం న్యాయం కంటే మించినది

12. నిరుపేదల కష్టాలను చూచి ద్రవించే హృదయం కలవాడే మహాత్ముడు

13. మనసా వాచా కర్మణా పవిత్రతను పాటించు.

వివేకానంద సూక్తులు



# స్నేహితులు లేని కాకులు

రచన: డి. శ్రీ చాతుర్య, 7 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి.



అనగనగా ఒక అడవిలో రెండు కాకులు ఉండేవి. ఆ కాకులు ఇతర పక్షులతో సరిగా కలిసేవి కాదు, మాట్లాడేవి కాదు, ఒంటరిగా ఉండేవి. వాటికి స్నేహితులు ఎవరూ లేరు.

వాటికి రెండు కాకి పిల్లలు. కాకులు వాటి పిల్లలను జాగ్రత్తగా పెంచుకుంటూ తమ దారిన తాము బ్రతికేవి.

అయితే ఒకరోజున ఒక వేటగాడు వచ్చాడు. ఆ రోజు కొంచెం చలిగా ఉందని, ఆ చెట్టు కింద నిప్పు పెట్టుకున్నాడు. కొంచెం సేపు అయ్యాక వెళ్ళిపోయాడు; కానీ ఆ నిప్పును

మాత్రం అలాగే వదిలేసాడు. మెల్ల మెల్లగా గాలి వీస్తుండేసరికి, ఆ చుట్టుప్రక్కల ఉన్న గడ్డి అంటుకున్నది. వాతావరణం వేడెక్కింది. దాంతో పిల్లలు ఏడవటం మొదలుపెట్టాయి; కానీ కాకులకు ఏం చేయాలో తెలీలేదు! పిల్లల దగ్గరికి వెళ్ళటానికి కూడా వాటికి ధైర్యం చాలలేదు.

'పిల్లలు ఆ  వేడికి తట్టుకోలేవు' అని అవి తల్లి కాకి ఏడవటం మొదలు పెట్టింది. తండ్రి కాకి అక్కడే వేరే చెట్టు మీదికి ఎక్కి "ఏడవకండి! అరవకండి! కదలకండి!" అని గట్టిగా కేకలు పెట్టింది.

అంతలో అటుగా వెళ్తున్న పావురం ఒకటి, ఆ హడావిడి విని అక్కడికి వచ్చి చూసింది. పరిస్థితిని అర్థం చేసుకున్నది.

వెంటనే తన స్నేహితుడైన ఏనుగు దగ్గరకు పరుగు పెట్టింది. "త్వరగా రా! పాపం, ఆ కాకి పిల్లలు మంటల్లో ఇరుక్కున్నాయి. వాటిని కాపాడాలి!" అని దాన్ని పిలుచుకొచ్చింది. ఏనుగు కూడా నడుస్తూ నడుస్తూనే ఆలోచించింది: దారిలో ఉన్న ఓ మడుగులోంచి తొండం నిండా నీళ్ళు పీల్చుకొని వచ్చింది.




ఆ నీళ్లని బలంగా ఊసి, మంటల్ని ఆర్పింది.

కాకులు పావురానికి, ఏనుగుకి కృతజ్ఞతలు చెప్పాయి. "ఓ, దీనిదేముంది, ఒకరికొకరం సాయం" అని అవి రెండూ చెట్టాపట్టాలు వేసుకొని వెళ్ళిపోయాయి.

వాటిని చూసాక అర్థమైంది కాకులకు- 'స్నేహితులు వుండటం చాలా ముఖ్యం- స్నేహితులు ఉంటే బాగుంటుంది' అని. అటు తర్వాత అవి ఇతర పక్షులతో స్నేహం చేసినై. అన్నింటితోటీ కలిసిమెలసి ఉండసాగినై.



RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/08/2018 Postal Regn No: HDP/008/2018-2020

# కొత్తపల్లి గురించి ఓ పేజీ

పూర్వం ఒక రాజుగారికి ఉన్న నలుగురు కొడుకులూ అప్రయోజకులయ్యారట. బహుశ: తండ్రిగారి క్రమశిక్షణ మరీ ఎక్కువైపోయిందేమో, వాళ్లకి ఏం చెప్పినా అర్థం కావట్లేదు. తల్లిదండ్రులూ, అమాత్యులూ, గురువులూ ఏం చెప్పాలని నోరు తెరిచినా వాళ్ల చెవులు మూసుకుపోతున్నాయి. తెలివి తేటలకేమీ తక్కువ లేదు. ఉన్నదల్లా అప్రయోజకత్వమే.

చివరికి రాజుగారు విష్ణుశర్మ అనే పండితుడిని రావించి, ఆయన్ని గౌరవించి, తన కొడుకుల్ని చూపించి, "వాళ్లని మీరే తీర్చిదిద్దాలని వేడుకున్నారు.విష్ణుశర్మ సరేనని వాళ్లని వెంటబెట్టుకెళ్ళారు. ఆరు నెలల్లో వాళ్లు నలుగురూ ప్రయోజకులై తిరిగి వచ్చారు!

విష్ణుశర్మ వాళ్లమీద వ్యాకరణ శాస్త్రాలనూ, వేదమంత్రాలనూ, క్షత్రియోచిత యుద్ధ విద్యల్నీ రుద్దలేదు. పుస్తకాలు ముందు పడేసి చదవకపోతే ఊరుకోనని ఉరమలేదు. కథలు చెబుతూ పోయాడు. ఆ కథలే రాజుగారి కొడుకుల్ని ప్రయోజకుల్ని చేశాయి. నీతి చంద్రికగానూ, పంచతంత్రంగానూ పేరొందాయి.

కథలు, ఆటలు, పాటలు వృధాపోవు. వాటిలో పిల్లలకు వాళ్లదైన ఒక ప్రపంచం దొరుకుతుంది. ఆ ప్రపంచంలో స్వేచ్ఛగా రెక్కలార్చుకుంటూ తిరిగి, వాళ్లు ఇతర ప్రాపంచిక విషయాల్ని సునాయసంగా నేర్చుకుంటారు. కథలు, ఆట పాటలు సేద తీరుస్తాయి. సేద తీరిన మనసులు ఊరట చెంది, మంచి మనుషుల్ని తయారు చేస్తాయి. సమాజంలో శాస్త్ర విషయాల్ని లోతుగా నేర్వాలంటే మనుషులకు వాటి పట్ల మక్కువ అవసరం. కళలు ఆ మక్కువని నిర్మిస్తాయి.

తెలుగు పిల్లలకు సంతోషాన్ని ఇచ్చేందుకుగాను మానవీయ స్పర్శ ఉన్న కథల్ని, ఆటపాటల్ని , విద్యా, విజ్ఞాన, వినోదాల్నీ పిల్లల స్వీయ దృక్పథంలో, బేషరతుగా అందించే ఉద్దేశంతో "కొత్తపల్లి" మీ ముందు నిల్చింది. పది సంవత్సరాలుగా, వంద సంచికలుగా, చాలా చాలా కథల్ని, పాటల్ని, బొమ్మలతో సహా అందరికీ అందుబాటులో ఉంచుతున్నది.

మీరు పిల్లలైతే, ఈ రచనల్ని, బొమ్మల్ని, పాటల్ని చదవండి, చూడండి, వినండి, ఆనందించండి. ఇలాంటివి మీకూ వచ్చి ఉంటాయి అనేకం. మాతో వాటిని పంచుకోండి. మీ రచనల్ని కూడా కొత్తపల్లి పత్రిక ప్రచురించగలదు. మీరు పెద్దలైతే, మళ్ళీ ఓసారి పిల్లల ప్రపంచంలోకి అడుగు పెట్టండి. వాళ్లకు నచ్చేవేవో చూడండి. మీ పిల్లలకు వీటిని చదివిపెట్టండి, వారిచేత చదివించండి, వాళ్లకు వినిపించండి, మీరూ ఈ పాటలు పాడుకోండి. మీలోని సృజనకూ పదును పెట్టండి. పిల్లలకు పనికొచ్చే రచనలు ఏమైనా ఉంటే మాకు పంపండి. స్నేహ హస్తాన్నందించండి, మీకు చేతనైన సాయం చేయండి.

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.